# నవ్వుల రుచుల రాజ్యం



## బ్రిటానియా

## బ్రిటా హై కౌంట్ బిస్కట్లు

## కేవలం రూ. 1/-కి బోలెడన్ని

బ్రిటానియా బిస్కట్లు అత్యుత్తమమైనవి

లింటాస్-BBC. 24-140 TL

యిప్పుడు

# అట్లాస్

## ఉత్తమరక బైస్కిల్

# పిల్లల

## బైక్స్‌లలో మూడుకొత్తసైజులు వస్తున్నాయి.



అట్లాస్ యిప్పుడున్న రకాలకి. 12'', 14''. 16'' సైజుల్లో కొత్తగామూడు సైకిళ్ళను చేరుస్తూంది.
అట్లాస్‌కు వుండేనాణ్యతతోనూ. గేరంటితోనూ కన్నులు మిరిమిట్లు గొలిపే రంగులతోనూ సరసమైనధరకు లభ్యమవుతున్నాయి.

నిజంగా యిది మంచి ఎంపిక.

**అట్లాస్ ఇండియాలో విరివిగా అమ్మకం జరుగుచున్నది.**

JAISONS-4-'76



జననం :
5–8–1908
మరణం :
24–9–1975

# శ్రీ చక్రపాణి

మా వ్యవస్థాపకులు, మార్గదర్శకులు శ్రీ చక్రపాణిగారు మమ్మ విడిచి సంవత్సరం గడిచింది. నిరంతరం వారి మేధాశక్తిని స్మరిస్తూ పత్రికా నిర్వహణలో వారి అడుగుజాడలలో నడుస్తూ వారి ఆశయసిద్ధికి కృషి చేస్తున్నాము. వారు మా మధ్య భౌతికంగా లేకపోయినా, ఆత్మ రూపంలో మమ్మ ఆశీర్వదిస్తూనే వున్నారు. ప్రథమ వర్థంతి సందర్భంలో ఆ మహనీయునికి శ్రద్ధాంజలి అర్పిస్తున్నాము.

"చందమామ"

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ ["దైవద్వేషం"] నారెడ్డి నాగిరెడ్డి రచన.

మనిషికీ దేవుడికీ ఉండే సంబంధాలలో చాలా రకాలున్నాయి. దేవుణ్ణి నమ్ముకున్న వాళ్ళలో కొందరు తమ ప్రయత్నాల ఫలితాన్ని దేవుడికి వదులుతారు. కొందరు భారమంతా దేవుడిమీదే వేసి, ఏ ప్రయత్నమూ చెయ్యరు. కొందరు దేవుడి ఊసే ఎత్తరు. మరికొందరు తామే అసలు దేవుళ్ళమంటారు. ''దైవద్వేషం''లో పాత్రలు ఎలాటివో పరిశీలించండి.

సంపుటి 59 సెప్టెంబర్ '76 సంచిక 3








# 39

ఒకనాడు, అపురూప సౌందర్యవతి అయిన కౌశాంబీ రాజకుమార్తె చంద్రమతి, తన ఇష్టసఖి వెంట నగరం చూడబోయింది. ఆమె నగరపర్యటన చేస్తూ, ముఖ్యోద్యానంలో, మన్మథాకారుడూ, శక్తిమంతుడూ అయిన కాశీరాజకుమారుణ్ణి చూసింది. అతను ఆమె తండ్రిని చూడ వచ్చి ఉన్నాడు.

రాజకుమారి ప్రథమ సందర్శనంలోనే ఆ యువకుణ్ణి మోహించి, తన సఖితో, ''ప్రియా, ఎలాగైనా ఈ రాత్రి నేను ఇతన్ని కలుసుకునే ఏర్పాటు చెయ్యి. చూస్తూనే ఇతనికి నా హృదయాన్ని అర్పించాను. శాస్త్ర సమ్మతమైన గాంధర్వవిధిలో నేను ఇతనికి భార్యను కావాలి,'' అన్నది.

అప్పుడు ఆమె ఇష్టసఖి రాజకుమారుడి వద్దకు వెళ్ళి, ''రాజకుమార్తె చంద్రమతి పంపగా వచ్చాను. నిన్ను చూస్తూనే ఆమె మోహపాశాలలో తగులుకుని, విరహబాధ చెందుతున్నదట. ఈ రాత్రి నువు వచ్చి, ఆమెను కలియకపోతే ఆమె ప్రాణాలు నిలవవట!'' అని చెప్పింది.

''ఈ రాత్రి నేను వచ్చి, ఆమె మందిరం ప్రవేశించేదెలా?'' అని రాజకుమారుడు అడిగాడు.

దానికి ఇష్టసఖి, ''ఆమె గది గవాక్షం నుంచి బలమైనతాడు వెళ్లాడగట్టుతాము. నువు దాని సహాయంతో ఎక్క రావచ్చు,'' అన్నది.

అలాటి ఏర్పాటు జరిగితే తప్పక వస్తానన్నాడు రాజకుమారుడు.

రాజకుమార్తె వద్దకు ఇష్టసఖి తిరిగి వచ్చి, తాను చేసిన ఏర్పాటు గురించి చెప్పింది.

రాజకుమారుడు తన బసకు తిరిగి వెళ్ళి, రాజకుమార్తె వృత్తాంతం గురించి దీర్ఘంగా యోచించాడు. అతను ఇలా అనుకున్నాడు :

''ఇది నేను చేయదగిన పని కాదు. నేను ఆమె తండ్రికి అతిథిని. గురుపుత్రి తోనూ, స్నేహితుడి భార్యతోనూ, కూతురి తోనూ, పూజారి భార్యతోనూ పోవటం బ్రహ్మహత్యతో సమానం. తన కీర్తికీ అభ్యుదయానికీ కళంకం తెచ్చే పనిని ఎవరూ చేయరాదు. నేను చేయబోయేపని నా కీర్తికి కళంకం తేవటమేగాక, నాకు హానికూడా కలిగించవచ్చు. నా మిత్రుడి కుమార్తెను పొందటం వల్ల నాకు పాపం చుట్టుకుంటుంది. రాజకుమార్తె క్షణిక మైన మోహావేశాన్నుంచి త్వరలో నే బయటపడకపోదు.''

ఇలా అనుకుని రాజకుమారుడు రాజ కుమార్తె కోసం వెళ్ళలేదు.

ఆ రాత్రి దైవాధీనం నగరంలో తిరు గుతూ, రాజభవనం గోడకు తాడు వేళ్ళాడుతూ ఉండటం చూసి, దాన్ని పట్టు కుని పైకి ఎక్కి, రాజకుమార్తె మందిరం ప్రవేశించాడు. కటిక చీకటిలో, తన ప్రియుడి కోసం ఆత్రంగా ఎదురు చూస్తున్న రాజకుమార్తె దైవాధీనాన్ని చూసి రాజకుమారుడే అనుకున్నది. ఆమె



అతన్ని గాఢంగా ఆలింగనం చేసుకుని, ''నిన్ను చూసిన క్షణంలోనే నా హృదయం దోచుకున్నావు. నా మనసులో నైనా నేను నీకు తప్ప మరొకరికి భార్యను కాలేను. ఎందుకని అలా మౌనంగా ఉన్నావు ?'' అని అడిగింది.

''దైవనిర్ణయం జరిగి తీరుతుంది.'' అన్నాడు దైవాధీనం.

ఈ మాట వినగానే రాజకుమార్తె తాను ఆలింగనం చేసుకుని, వివాహప్రమాణం చేసినది దైవాధీనానికి అనీ, రాజకుమారు డికి కాదనీ గ్రహించి, నిశ్చేష్టురాలయింది. తిరిగి చైతన్యం రాగానే ఆమె అతన్ని తాడు వెంబడి కిందికి పంపేసి, ఇలాటి

ప్రమాదాలు మరి కలగకుండా, తాడును పైకి లాగేసుకున్నది.

రాజభవనం నుంచి ఉద్వాసన చెప్పించుకున్న దైవాధీనం ఒక పాడుపడిన దేవాలయానికి వెళ్ళి, అక్కడ నిద్రపోయాడు. ఆ గుడిలో ఒక వెలయాలిని కలుసుకునేటందుకు ఏర్పాటు చేసుకుని ఉండిన రక్షకభటుడు అక్కడికి వచ్చి, దైవాధీనాన్ని, "ఎవరు నువు?" అని అడిగాడు.

"దైవనిర్ణయం జరిగి తీరుతుంది," అన్నాడు దైవాధీనం. దీన్నిబట్టి ఆ వ్యక్తి ఎవరో భటుడికి తెలిసింది. అతను దైవాధీనంతో, "ఈపాడుపడిన దేవాలయంలో ఎందుకు పడుకుంటావు. హాయిగా నా ఇంటికి వెళ్ళి, నా పక్కలో పడుకో. నేను రాత్రి గస్తీ తిరుగుతున్నాను గనక నా కేమీ ఇబ్బంది కలగదు," అని భటుడు దైవాధీనానికి తన ఇంటికి దారి చెప్పాడు.

భటుడి ఇంటికి వచ్చిన దైవాధీనం పొరపాటున భటుడి కుమార్తె గది ప్రవేశించి, ఆమె శయ్యను సమీపించాడు.

ఆమె పేరు వినయవతి. ఆమె చాలా చక్కనిది. ఆమె ఈడేరి చాలాకాలమయినప్పటికీ ఆమె కింకా వివాహం కాలేదు. ఎందుచేతనంటే, ఆమె ప్రేమించి పెళ్ళాడగోరిన యువకుడు పేదవాడు కావటం చేత ఆమె తండ్రి ఆ పెళ్ళికి ఒప్పుకోలేదు.

తన తండ్రి ఇంటలేని సమయంలో ఆమె తన ప్రియుణ్ణి తన యింటికి రప్పించి, గాంధర్వవిధిని అతన్ని పెళ్ళాడి, తమ వివాహానికి తండ్రిని ఒప్పిందామనుకున్నది. ఈ పథకం ప్రకారం ఆ యువకుడు ఆమె కోసం వస్తూ, దూరాన భటుడూ, దైవాధీనం మాట్లాడుకుంటూ ఉండటం చూశాడు. అతను చూస్తూండగానే దైవాధీనం భటుడి ఇంటి కేసి వెళ్ళటం కూడా జరిగింది. తమ పథకం భటుడికి తెలిసిపోయిందనీ, తనను పట్టుకునేటందుకు భటుడు ఎవరినో ఇంటికి పంపాడనీ భయపడి, వినయవతి ప్రియుడు చప్పున వెనుదిరిగి తన ఇంటికి తిరిగి పోయాడు.





# మాయాసరోవరం

## 9

[అడవి ఏనుగుల్ని తరిమివేశాం తరవాత, మొసలి ఆకారంవాడు, చరకాచారి కోసం బయలు దేరాడు. కొండచిలువకు చిక్కి ప్రాణాపాయస్థితిలో వున్న చరకాచారిని, జయశీలుడు కాపాడి, అతణ్ణి ప్రశ్నిస్తున్న సమయంలో, మొసలి ఆకారం వాడు అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే జయశీలుడు కత్తిపిడిమీద చేయివేశాడు. సిద్ధసాధకుడు దండం ఎత్తి పట్టుకున్నాడు. తరవాత–]

జయశీలుడూ, సిద్ధసాధకుడూ నిర్భయంగా నిలబడటమే కాక, తనను ఎదిరించేందుకు సిద్ధపడటం చూసి, మొసలి ఆకారంవాడు గతుక్కుమన్నాడు. తన వాహనాన్నీ, తన మొసలి రూపాన్నీ, చేతిలోగల వాడి శూలాన్నీ చూసి, వాళ్ళిద్దరూ ఠారుకుని, వెనుదిరిగి పారిపోతారని వాడు భావించాడు; కాని అలా జరగలేదు.

మొసలి ఆకారంవాడు శూలం ఎత్తి పట్టుకుని, పెద్ద గొంతుతో, "మీరెవరు? ఈ భయంకరారణ్యంలో మీ కేంపని?" అంటూ జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ గద్దించి అడిగాడు.

జయశీలుడు కత్తిని ఒర నుంచి బయిటికి లాగి, "మొసలి చర్మం కప్పుకున్న నిన్ను చూస్తే, నాకు నవ్వొస్తున్నది. నేనడగవలసిన ప్రశ్నలు నువ్వడుగు



తున్నావు. సరే, నువ్వెవరు? ఈ అరణ్యంలోకి ఏం పనిమీద వచ్చావు? నువ్వెక్కివున్న ఏనుగుకూ్కడా ఏదో వింత చర్మం తొడుగు వేసినట్టున్నావు! ఈ కపట నాటకమంతా ఎందుకాడుతున్నావు?'' అని అడిగాడు.

''ఛీ, అల్ప మానవుడి నుంచి యింత ధిక్కారమా? నేను సహించను,'' అంటూ మొసలి ఆకారంవాడు, జలగ్రహాన్ని అదిలించబోయేంతలో, అంతవరకూ అతడి తోక పట్టుకుని వణికిపోతున్న వీరనారాయుడు మొండి ధైర్యం తెచ్చుకుని, మొసలి ఆకారంవాడి శూలంనున్న చేతిని, తన రెండు చేతులతో గట్టిగా పట్టుకుని, ''మొసలిదొరా, కాస్త నిదానించు. నువ్వెంత వీరుడివైనా డొక్కలో యింకా గుచ్చుకుని వున్న కత్తిని మరిచిపోకు. ఆ ఇద్దరితో సమాధానపడటం మంచిది. చరకాచారిగారు వైద్యానికి పనికివస్తుందని, కొండచిలువను పట్టబోయి చిక్కులో పడినట్టున్నది,'' అన్నాడు.

వీరనారాయుడు యిలా అన్న తరవాత గాని, మొసలి ఆకారంవాడు పరీక్షగా చరకాచారి కేసి చూడలేదు. ఇప్పుడు చరకాచారి లేచి నిలబడేందుకు ప్రయత్నిస్తూ, మూలుగుతున్నాడు. అతడి పక్కనే నేలమీద తల తెగి పడివున్న కొండచిలువ, గిలగిల కొట్టుకుంటున్నది. ఇది చూసి మొసలి ఆకారం వాడు ఒక తృటికాలం నిశ్చేష్టుడై, ''చరకాచారీ, నాకు వైద్యం చేసేందుకు కొండచిలువను పట్టుకోబోయి, చిక్కులోపడ్డావా? నీకు కావాలంటే, ఏనుగులనే మింగగలిగినంత పెద్ద కొండచిలువలను, నా శూలానికి గుచ్చి తెచ్చి, యిచ్చివుండేవాడినే!'' అన్నాడు.

చరకాచారి, ''మొసలి ప్రభూ!'' అంటూ ఏమో చెప్పబోయి, గొంతు పెగలక, గట్టిగా ఓ మారు దగ్గి, ఆయాసపడుతూ చెట్టు బోదెను అనుకుని, చేఎత్తి

అతడికి జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ చూపించాడు.

మొసలి ఆకారంవాడు, వాళ్ళిద్దరి కేసీ కళ్ళెర్రచేసి చూస్తూ, "మీరింకా యిక్కడే వున్నారా? ఊం, బతకాలని వుంటే, నా కంటికీ, శూలానికీ అనసంత దూరం పారిపొండి," అన్నాడు.

ఆ వెంటనే జయశీలుడు కత్తి ఎత్తి ముందుకు ఒక అడుగు వేశాడు. అది చూసి వీరనారాయుడు చిన్నగా ఒక కేక పెట్టి, జయశీలుడితో, "ఓ శూరకత్తి, చినబాబూ, కాస్త ఆగు! ఈ మొసలిదొర మీద కత్తితో కలబడటం అంటే, నిస్స హాయుడైన మనిషిని హత్య చేయటంతో సమానం. ఈయన డొక్కలో దిగివున్న కత్తిని చూశావా? దాన్ని బయిటికి లాగకపోతే, నెత్తురు గడ్డకట్టి మరణించి తీరుతాడు," అన్నాడు.

"వీడు అంత సుఖంగా చావటం నా కిష్టంలేదు. వీడి డొక్కలో విరిగిన కత్తి మిగతా భాగం కనకాక్షరాజుగారి దగ్గిర వున్నది!" అన్నాడు జయశీలుడు.

జయశీలుడు మాట పూర్తి చేసేలోపలే మొసలి ఆకారంవాడు పెద్దగా హుంక రించి, శూలం పైకెత్తి, "ఒరే, అలా అయితే, నే నెవరైందీ నీకు తెలుసన్న మాట!" అన్నాడు.

"తెలుసు. అరణ్యంలో రాజ కుమారుణ్ణీ, కుమార్తెనూ అపహరించుకు పోయినవాడివి నువ్వు! నీ డొక్కలో





విరిగివున్న కత్తి రాజకుమారుడు కాంచన వర్మది,'' అన్నాడు జయశీలుడు.

''ఇంత తెలిసినవాడివి నువ్వు బతకటం క్షేమం కాదు,'' అంటూ మొసలి ఆకారంవాడు తన వాహనాన్ని అదిలించి, జయశీలుడి కేసి దూకించబోయేంతలో, పక్కనే వున్న వీరనారాయుడు శూలాన్ని రెండు చేతులతో వడిసి పట్టుకుని, ''మొసలిదొరా, అంత ఒళ్ళు మరిచిన కోపం, మీకు రక్తప్పోటు తెస్తుంది, ప్రమాదం!'' అని కేక పెడుతూ, జలగ్రహం మీదినుంచి పట్టు తప్పి, శూలంతోపాటు దభీమంటూ కింద పడిపోయాడు.

జయశీలుడు అదే క్షణంలో మెరుపులా ఎగిరి జలగ్రహం మీదికి పోయి, వెనక నుంచి మొసలిఆకారంవాడి మెడ పట్టుకున్నాడు. ఈ లోపల సిద్ధసాధకుడు కింద పడిన శూలాన్ని చేతిలోకి తీసుకుని, ''జై, మహాకాళా!'' అంటూ కేక పెట్టాడు.

మొసలిఆకారంవాడు యీ విధంగా కన్ను మూసి తెరిచేంతలో తన శూలాన్ని పోగొట్టుకోవటమే గాక, నిరాయుధుడుగా తన శత్రువుకు దొరికిపోయాడు. జయశీలుడు కత్తిని అతడి మెడకు ఆనించి, ''ఒరే, నీ పేరేమిటి? నువ్వు లొంగిపోతావా లేక మెడ నరకమంటావా?'' అని అడిగాడు.

మొసలిఆకారంవాడు ఒక నిమిష కాలం నిర్విణ్ణుడైపోయి, అంతలోనే తేరుకుని, ''ఒరే, మనిషీ, నీ సాహసానికి మెచ్చాను,'' అన్నాడు.

ఆ జవాబుకు సిద్ధసాధకుడు పెద్దగా నవ్వి, ''జయశీలుడి సాహసాన్ని నీ బోటి పగటివేషం వెధవ మెచ్చటం ఏవిటి? సాక్షాత్తూ ఆ మహాకాలుడే మెచ్చి, అతడి కత్తిని దీవించాడు,'' అన్నాడు.

"ఎవరన్నావు,మహాకాళుడా? అదెట్లా?" అన్నాడు మొసలి ఆకారంవాడు.

జయశీలుడు అతడి మెడ పట్టుకుని గట్టిగా ఊపి, ''ఒరే, మొసలితొడుగూ,

అదంతా చాలా పెద్దకథ! నే నడిగినదానికి జవాబు చెప్పలేదు. నీ పేరేమిటి? లొంగి పోయి మర్యాదగా నా వెంట హిరణ్యపురం రాజుగారి దగ్గిరకు వచ్చి, ఆయన పిల్లల్ని ఎక్కడ దాచావో చెపుతావా?'' అన్నాడు.

''నా పేరు మకరకేతు. రాజుగారి పిల్లలు ఎక్కడ వున్నదీ చెప్పేందుకు రాజుగారి దగ్గిరకు పోవటం ఎందుకు? ఆ సంగతి నీకే చెపుతాను,'' అన్నాడు మొసలిఆకారంవాడు.

వాడు అంత తేలిగ్గా, తానపహరించిన యువరాజూ, యువరాణులను గురించి చెపుతాననటం, జయశీలుడికి నమ్మ దగినదిగా కనిపించలేదు. ఇందులో ఏదో మోసం వున్నదని అతడు అనుకున్నాడు. ఏమైనా, యీ దుర్మార్గుణ్ణి రాజుగారి సమక్షానికి తీసుకుపోవటమే అన్నివిధాలా మంచిదనుకున్నాడు, జయశీలుడు. రాజు గారూ, మంత్రీ యితణ్ణి ప్రశ్నించి, నిజం రాబట్టి, తరవాత ఏం చేయాలో నిర్ణ యిస్తారు....

జయశీలుడు యిలా ఆలోచించి, మకర కేతుడితో, ''కేతూ, నీ సంకరజాతి ఏనుగును వెనక్కు తిప్పి, హిరణ్యపురం దారి పట్టించు. దారిలో పారిపోయేందు కేమైనా కుటిలప్రయత్నం చేశావో, ఒక్క వేటుకు నీ మెడ నరికివేస్తాను,'' అన్నాడు.



మకరకేతు కిక్కురుమనకుండా జల గ్రహాన్ని అదిలించి వెనక్కు తిప్పాడు. సిద్ధసాధకుడు గబగబా ఏనుగు దగ్గిరకు పోయి, ''జయశీలా, నేనూ వస్తున్నాను. కాస్త చేయి సాయంయిచ్చి, ఏనుగు పైకి లాగు,'' అన్నాడు.

జయశీలుడు, సిద్ధసాధకుణ్ణి ఏనుగు మీదికి గుంజాడు. ఏనుగు యిక కదల బోయేంతలో, వీరనారాయుడూ, చరకా చారీ చప్పట్లు చరుస్తూ, "అయ్యలారా, ఆగండి! ఇక్కడికి మా గ్రామం దగ్గిర్లోనే వున్నా, అక్కడికి చేరాలంటే, యీ కీకా రణ్యం దాటాలి. దారిలో పులీ, ఎలుగూ, తోడేలూ!" అన్నారు.



"మీకొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. మీ ఇద్దరూ, యీ దుర్మారుడికి వైద్యంచేసే ప్రయత్నంలో వుండబట్టే, వీడు మాకు దొరికాడు. ఏనుగు మెల్లిగా నడుస్తుంది, వెనగ్గా మీరురండి," అన్నాడు జయశీలుడు.

అందరూ హిరణ్యపురం దిక్కు కేసి బయలుదేరారు. నాలుగైదు నిమిషాల నిశ్శబ్దం తరవాత చరకాచారి గట్టిగా ఓమారు గొంతు సవరించుకుని, "జయశీల ప్రభూ, మా దొక మనవి," అన్నాడు.

జయశీలుడు కొంచెం ఆశ్చర్యపడి, "ఏమిటా మనవి?" అని అడిగాడు.

"నేనూ, యీ వీరనారాయుడూ పొద్దుటి నుంచి, యీ మొసలితొడుగువాడికి వైద్యం చేసేందుకు నానాహైరానా పడ్డాం. మరొక మరొక మనిషైతే, అంత పొడవుకత్తి డొక్కలో దిగబడినందుకే క్షణాల మీద చచ్చేవాడు. కాని, వీడు ఆ విరిగిన కత్తిని, ఏదో ఆభరణంలా ధరించినట్టు కనబడుతున్నాడు. పైగా, వాడి నాడి పరీక్షించాను; వాడి శరీరంలో ప్రవహిస్తున్నది శీతలరక్తం. వీడేదో జల ప్రాణి!" అన్నాడు చరకాచారి.

"అంటే వీడు, నీటిలోనూ, నీటి బయటా కూడా బతగ్గలిగే, ఏకప్పలాంటి జీవో అంటావు? కనకాక్షరాజుగారికి వీడితో పనితీరిన తరవాత, వీడినీ, వీడి వాహనాన్నీ మీకు బహుమతిగా యిప్పిస్తాను. అప్పుడు వీడి మీద, ఏవైనా వైద్య పరిశోధనలు చేద్దువుగాని, చరకాచారీ," అన్నాడు జయశీలుడు.

ఈ సంభాషణ విని మకరకేతు పళ్ళు పటపట కొరికాడు. జయశీలుడు కత్తిని వాడి కంఠం మీద గట్టిగా ఆనించి పట్టుకుని, "ఓయ్, మకరకేతూ, జాగ్రత్త! ఏదైనా దుస్సాహసానికి పూనుకున్నావో, మొండెం నుంచి తల తెగి కింద పడుతుంది," అన్నాడు.

"అహా, జయశీలా! ఆ రోజు రాత్రి నీ కత్తివేటుకు శ్మశానంలో, ఆ మహాభూతం ఆవహించిన కాటికాపరి తల తెగి

కిందపడి, ఎలా చిందులాడింది! ఆ దృశ్యం అమోఘం, అపూర్వం!'' అన్నాడు సిద్ధ సాధకుడు ఉత్సాహం ఆపుకోలేక చేతిలోని శూలాన్ని గిరగిరా తిప్పుతూ.

ఏనుగుకు వెనకగా నడిచి వస్తున్న వీర నారాయుడు, పక్కన వున్న చరకాచారి కేసి కోపంగా చూస్తూ, ''ఆచారిగారూ, మీరు చేయవలసిన మనవి మాట మరిచి, ఆ మొసలిపీనుగు వెధవ శరీరతత్వాన్ని గురించి, చాలా మాట్లాడారు,'' అన్నాడు.

''అవునోరే, నారాయుడూ!'' అంటూ చరకాచారి నాలుక కరుచుకుని, గొంతెత్తి జయశీలుడితో, ''జయశీల ప్రభూ! నేను తమకు విన్నవించాలనుకున్న మనవి మాట మరిచేపోయాను. పొద్దుటినుంచి ఈ మొసలిఆకారంవాడి కోసం నేనూ, వీరనారాయుడూ నానాప్రయాసాపడ్డాం. వాడికి శస్త్రంచేసి కత్తి బయిటికి లాగ లేదనుకోండి—అయినా మా శ్రమ గుర్తించి, వైద్యసలహా రుసుమయినా యిప్పించండి,'' అన్నాడు.

జయశీలుడు చిన్నగా నవ్వి, ఏదో జవాబు యివ్వబోయేంతలో పక్కనేవున్న ఒక పెద్ద చెట్టుకొమ్మల్లో నుంచి రివ్వు మంటూ ఒక బాణం వచ్చి, మకరకేతు భుజంలో దిగింది. బాణందెబ్బ తింటూనే మకరకేతు బాధతో పెద్దగా ఒక కేకపెట్టి, ''జయిశీలా, యిది దురన్యాయం! నీకు లొంగి, నీ ఆజ్ఞల్ని శిరసావహిస్తున్న నన్ను, శూలంతో పొడుస్తావా?'' అన్నాడు.



హఠాత్తుగా యిలా బాణం వచ్చి మకర కేతుకు తగలగానే జయశీలుడూ, సిద్ధ సాధకుడూ కూడా ఉలిక్కిపడ్డారు. జయ శీలుడు తలఎత్తి చెట్టుకొమ్మల్లోకి చూసేం తలో, అక్కడినుంచి వికవికమనే నవ్వుతో, "ఒరే, మొసలిముచ్చూ! నేను కొట్టిన అడవికోడిని దొంగిలించుకుపోతావా? నువ్వు భూతానివి కాదు; మనిషివే. ఆ సంగతి తెలిసిపోయింది. ఇదుగో, యీ బాణం నీ గుండెల్లో దిగబోతున్నది," అన్నమాటలు వినిపించినై.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ కూడా ఆ గొంతు గుర్తించారు. ఆ మాట్లాడుతున్న వాడు, బోయ భీమన్న. వెంటనే సిద్ధ సాధకుడు తన మంత్రదండాన్ని పైకెత్తి, "ఒరే, బోయ భీమన్నా, యింకో బాణం వదిలావో, నిన్ను మహాకాళుడికి ఆహారంగా వేస్తాను. చెట్టు దిగిరా," అంటూ కేక పెట్టాడు.

"ఎవరది? రాజుగారి దయ్యాలపోతా?" అంటూ బోయభీమన్న కీచుమన్నాడు.

"నేను దయ్యాలపోతును కాదు, మాంత్రికుణ్ణి, సిద్ధసాధకుణ్ణి. నోరు మూసుకుని చెట్టు దిగి వస్తావా లేక, మంత్రం ప్రయోగించి, అక్కడే కొమ్మల్లో నిలువునా మంటల్లో కాల్చివేయ మంటావా?" అన్నాడు సిద్ధసాధకుడు.

"నన్ను బాణంతో కొట్టినవాడు, ఆ బోయ వెధవా? ఎంత గొప్ప మాయాసరోవరేశ్వ రుడి బంటుకు, ఎంత దుర్దశ పట్టింది! వాణ్ణి చెట్టుతోపాటు జలగ్రహం చేత నేల పడగొట్టించి, సున్నంలోకి ఎముక లేకుండా తొక్కిస్తాను," అంటూ మకరకేతు, జల గ్రహాన్ని గట్టిగా హెచ్చరించాడు.

జయశీలుడు వారించేలోపలే జల గ్రహం ఒకసారి ఘీంకరించి, దూకుతూ పోయి బోయ భీమన్న ఎక్కివున్న చెట్టును తలతో ఒకసారి ఢీకొట్టి, తొండంతో పట్టు కుని కూకటివేళ్ళతోపాటు పెకలించింది. చెట్లకొమ్మల్లో వున్న బోయ భీమన్న కిందూ, మీదూ అవుతూ ఆర్తనాదాలు చేగుసాగాడు. —(ఇంకావుంది.)





# దైవద్వేషం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్నిదించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నీ దీక్ష చూడగా నీకు దేవుడిపై విశ్వాసం ఉన్నట్టు కనబడుతుంది. అతిసారుడు లాటి దైవ ద్వేషం గలవాళ్ళు తమ క్షేమాన్ని కూడా తాము కాపాడుకోలేక, తాడు తెగిన గాలి పటాలలాగా అయిపోతారు; వారికి స్థిమితం ఉండదు. నీకు శ్రమ తెలియకుండా ఉండగలందులకు అతిసారుడి కథ చెబుతాను, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

పాటలీపుత్రంలో ఉండే వర్తకులలో అతిసారుడు ఒకడు. అతడికి ఎవరూ లేరు; సంసారం లేని ఒంటరిగాడు. అతనికి విధిలో నమ్మకం ఉన్నదిగాని,

## బేతాళ కథలు



దేవుడిలో నమ్మకం లేదు. రాసిపెట్టి ఉన్నది జరుగుతుంది. ప్రార్థించిన మాత్రాన దేవుడు విధిని తప్పించడని అతని నమ్మకం. అందుచేత అతను ఎన్నడూ దేవాలయాలకుపోయి, ప్రార్థనలు చేసి, మొక్కుకోవటాలు ఎరగడు. తన కున్న కాస్త డబ్బూ పెట్టుబడి పెట్టి వర్తకం చేస్తూ, అందులో చాలా నిజాయితీగా నడుచుకునేవాడు.

ఒకసారి అతను దేశాంతరాలకు పోయే వర్తకులతో కలిసి, నౌక మీద తన సరుకులతో వర్తకానికి బయలుదేరాడు. నడి సముద్రంలో పెద్ద తుపాను చెలరేగి, నౌకలోని వర్తకులకు అపాయం తటస్థించింది. అప్పుడు వర్తకులందరూ, తమనూ, తమ సరకులనూ కాపాడమని దేవుణ్ణి ప్రార్థించసాగారు. ఒక్క అతిసారుడు మాత్రం నిర్లిప్తంగా కూర్చున్నాడు.

అది చూసి మిగిలిన వర్తకులు, "ఈ నాస్తికుడి మూలానే మనకు ఈ ఉపద్రవం వచ్చి పడింది. వీణ్ణి వదిలించుకుంటే గాని మనం ఈ ఆపదనుంచి బయటపడం," అనుకుని, అందరూ కూడబలుక్కుని, అతిసారుణ్ణి ఒక కొయ్యపలకకు కట్టి, సముద్రంలో పారేశారు. తరవాత కొద్దిసేపటికి నౌక మునిగిపోయింది. దానితోబాటు వర్తకులందరూ సముద్రంపాలు అయిపోయారు.

అతిసారుడు మాత్రం స్పృహ తప్పి, కొయ్యపలకతో బాటు మణిద్వీపానికి కొట్టుకువచ్చాడు. సమీపంలో ఉన్న బెస్తవాళ్ళు అతన్ని చూసి, ఏ రాజకుమారుడో అనుకుని, తమ రాజైన రత్నకేతుడి వద్దకు తీసుకుపోయారు.

అతను సముద్ర వ్యాపారం మీద పోతూ, నడి సముద్రంలో నావ మునిగి, ప్రాణాలతో బయటపడ్డ సంగతి తెలుసుకుని రాజు అతన్ని పాటలీపుత్రానికి పంపే ఏర్పాట్లు చేస్తానన్నాడు.

"వద్దు, మహారాజా! పాటలీపుత్రంలో నాకు ఎవరూ లేరు. నా సొత్తంతా

సముద్రం పాలయింది. ఏదైనా పని ఇప్పించండి, ఇక్కడే ఉంటాను,'' అన్నాడు అతిసారుడు.

రాజు అతని వైఖరికి సంతోషించి, అతన్ని తన అంతరంగికుడుగా నియమించాడు. రాజు గొప్ప దైవభక్తి గలవాడు. అతిసారుడికి ఏ కోశానా దైవచింతన లేక పోవటం చూసి ఆశ్చర్యం కలిగింది.

''సర్వ జీవకోటికీ ఆధారభూతుడైన భగవంతుడి పట్ల నీ కెందుకు ద్వేషం?'' అని రాజు అతిసారుణ్ణి అడిగాడు.

అందుకు అతిసారుడు, ''ప్రభూ, నాకు కోరికలూ, ఆశయాలూ, భయాలూ లేవు. నేను పాపాలు చెయ్యను, ఒకరికి ద్రోహం తలపెట్టను; చేతనైతే సహాయమే చేస్తాను. ఏమికోరి, ఎవరికి భయపడి నేను దేవుణ్ణి ఆరాధించను?'' అని ఎదురు ప్రశ్న వేశాడు.

ఒకనాడు రత్నకేతుడు సభామంటపం లోకి పోబోతూండగా, వెనకనుంచి అతిసారుడు, ''మహారాజా, ఆగండి! నేనూ వస్తున్నాను,'' అన్నాడు.

రాజు నిలబడ్డాడు. ఆ క్షణంలో ఆయనకు కొద్ది దూరంలో ఉన్న మంటప ముఖద్వారం ఫెళ్ళున విరిగి పడింది. భగవంతుడు తన ప్రాణం కాపాడినందుకు రాజు అర్చనలు చేశాడు.



రోజూ రాజు తన ఇష్టదైవం ఆలయానికి వెళ్ళేవాడు. ఒకనాడు ఆయన పట్టుబట్టి అతిసారుణ్ణి తనవెంట తీసుకుపోయాడు. రాజు ఆలయం లోపలికి వెళ్ళినా అతిసారుడు వెలపలే ఆగిపోయాడు.

రాజు దేవుణ్ణి ధ్యానిస్తూండగా, ఏం దుర్బుద్ధి పుట్టిందోగాని అంగరక్షకుడు ఒర నుంచి ఖడ్గం తీసి రాజును చంప బోయాడు. అది చూస్తున్న అతిసారుడు చప్పున తన పిడిబాకు తీసి, అంగ రక్షకుడిపై విసిరాడు. అంగరక్షకుడు చావు కేకపెట్టి పడిపోయాడు. వాణ్ణి చూసి నిర్ఘాంతపోయిన రాజుకు అతిసారుడు, జరిగినదేమిటో చెప్పాడు.

రాజు మరొకసారి దేవుడి ముందు సాష్టాంగపడి, అతిసారుడితో, "చూశావా దైవలీల? ఇదిచూసి అయినా నీకు దేవుడిలో నమ్మకం కలగటం లేదా? నీ దైవ ద్వేషం మార్చుకో," అన్నాడు.

అతిసారుడు రాజుకు ఏ సమాధానమూ చెప్పలేదు. కాని మర్నాడే అతను రాజు గారి నడిగి పాటలీపుత్రానికి ప్రయాణమై వెళ్ళాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, అతిసారుడికి దేవుడి మీద ఎందుకు పగ? రత్నకేతుడు అంతగా నచ్చచెప్పినా అతను ఎందుకు మారలేదు? రాజు తనకు ఎంతో మేలు చేసినప్పటికీ, అతని కొలువు మాని ఎందుకు వెళ్ళిపోయాడు? ఒకప్పుడు పనికి రాని పాటలీపుత్రం అతనికి ఇప్పుడెలా పనికివచ్చింది? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "అతిసారుడు దైవద్వేషి అనటానికి ఆధారం ఏమీ కనబడటం లేదు. అతనికి దేవుడి యందు మూఢభక్తి లేదు, అంతే. దేవుడి పైన మూఢభక్తి గల వాళ్ళు తమకు మేలు జరిగినప్పుడు దేవుణ్ణి పూజిస్తారుగాని, కీడు జరిగేతరుణంలో సాటిమానవులను శిక్షిస్తారు. పాటలీపుత్ర వర్తకులు అతిసారుడికి ఆపత్సమయంలో కీడే గదా చేశారు? రేపు ఈ రాజుకు అలాటి పరిస్థితే కలిగితే అతిసారుడికి ప్రమాదం జరగ వచ్చుగద? ఒకసారి అనుకోకుండానూ, రెండోసారి బుద్ధి పూర్వకంగానూ అతిసారుడు రాజుప్రాణాలు కాపాడాడు. రెండుసార్లూ రాజు దేవుడికే ధన్యవాదాలు చెప్పాడు గాని, అతిసారుడికి కృతజ్ఞత తెలుపుకోలేదు. అందుకే దేవుడిపై మూఢభక్తిగల వాడివెంట ఉండటానికి జంకి అతిసారుడు తనకు ఏమీలేని పాటలీపుత్రానికే బయలుదేరాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# మంచి మనసు

పూర్వం కల్పక రాజ్యాన్ని కదంబ సేనుడు అనే రాజు పాలించేవాడు. రాజు సమర్థుడు; దేశం సహజ సంపద గలది; ప్రజలు నాగరికతా, సంస్కారమూ గలవాళ్ళు. అందుచేత ఇతర రాజులకు కల్పకం అంటే ఎంత అసూయ ఉన్నా, కదంబసేనుడి పేరు వింటే సింహ స్వప్నంగా ఉండేది.

ఇలా ఉండగా కదంబసేనుడి అంగరక్షకుడు చనిపోయాడు. సమర్థుడూ, విశ్వాసపాత్రుడూ అయినవాడు దొరికితే రాజు మరొక అంగరక్షకుణ్ణి నియమిస్తాడన్న వార్త పరిసర రాజ్యాలలో కూడా పొక్కిపోయింది. అందుచేత ఆ పదవి సంపాదించటం కోసం అనేకమంది కల్పకానికి బయలుదేరారు. వారిలో కొందరు సరిహద్దులో గల ఒక సత్రంలో బసచేశారు.

అలా వచ్చిన వారిలో దండపాణీ, ధూమకేతూ అనేవాళ్ళు అంగరక్షకుడి ఉద్యోగానికి చాలా అర్హులుగా కనపడ్డారు. ఇద్దరిలోనూ దండపాణి మరింత చురుకైనవాడూ, బలాఢ్యుడూ, ధీరుడూగా కనిపించాడు.

అన్నివిధాలా తనకన్న చురుకైన దండపాణి ఉండగా తనకు రాజుగారి అంగరక్షకుడు అయే అవకాశం దొరకదని ధూమకేతువు గ్రహించి, దండపాణిని తొలగించటానికి బాగాఆలోచించి ఒక ఉపాయం పన్నాడు.

అతను దండపాణితో, ''మిత్రమా, నగరంలో నాకు కావలసిన వాళ్ళున్నారు. వాళ్ళను చూసి ఒకటి, రెండు రోజులలో వచ్చేస్తాను. కాని ఈ లోపల నా కోసం మా ఇంటినుంచి ఎవరైనా వచ్చిన పక్షంలో, నా క్షేమ సమాచారం తెలిపి, వాళ్ళకు

వీరేపల్లి జయరాంరెడ్డి



ఈ ఉత్తరం ఇయ్యి. ఈ చిన్న సహాయం చేసిపెట్టు," అంటూ ఒక ఉత్తరం ఇచ్చాడు.

తరవాత ధూమకేతు సరాసరి రాజ భవనానికి వెళ్ళి, రాజుగారిని కలుసుకుని, "మహారాజా, తమరిని హెచ్చరించ వచ్చాను. మీ తూర్పు సరిహద్దున ఉన్న సత్రంలో ఒక విదేశీగూఢచారి ఉన్నాడు. అతని పేరు దండపాణి. అతను తమ అంగరక్షకుడి పదవి సంపాదించే ప్రయత్నంలో ఉన్నాడు. తమరు నా మాట నమ్మనవసరంలేదు. నేను చెప్పినట్టు చేస్తే నిజం తప్పక తెలుస్తుంది," అంటూ రాజు ఏం చెయ్యాలో చెప్పాడు.

కదంబసేనుడు ఆ రాత్రి భటులను పంపి సత్రం చుట్టూ కాపు వేయించాడు. కొంతసేపటికి ఒక అశ్వికుడు అటుగా వచ్చి, సత్రంలోకి ప్రవేశించి, దండపాణిని కలుసుకుని, ధూమకేతు గురించి అడిగాడు. దండపాణి ధూమకేతు తన కిచ్చిన ఉత్తరం తెచ్చి ఆ మనిషికి ఇచ్చాడు. మరుక్షణం రాజభటులు వచ్చి, ఆ ఉత్తరాన్ని తీసేసుకుని, దండపాణిని చుట్టుముట్టారు. ఆ గొడవలో అశ్వికుడు గదినుంచి చల్లగా బయటపడి, తన గుర్రం మీద ఎక్కి మెరుపులాగా మాయమయాడు. వాడు ధూమకేతు నియమించినవాడే.

రాజభటులు ఉత్తరంతో సహా దండపాణిని తీసుకుపోయి రాజు ముందు హాజరుపెట్టారు.

ఆ ఉత్తరంలో దండపాణి గూఢలిపిలో తాను క్షేమంగా చేరాననీ, రాజుగారి అంగరక్షకుడి పదవికి తాను ఎన్నుకోబడే అవకాశాలు హెచ్చుగా ఉన్నాయనీ, వీలయినంత త్వరలోనే అనేక విషయాలు సేకరించి తెలియజేయగలననీ ఎవరికో రాసినట్టుగా ఉన్నది.

దండపాణి శత్రురాజు గూఢచారి అని స్పష్టం అయేసరికి కదంబసేనుడు మండిపడి, దండపాణికి అజన్మ కారాగారశిక్ష విధించాడు. దండపాణిని ఖైదు చేశారు.

ధూమకేతు తనకు చేసిన ద్రోహం దండపాణికి అర్థమయింది.

తరవాత కదంబసేనుడు ధూమకేతు సహాయానికి అభినందించి, అతన్ని అప్పటికప్పుడే తన అంగరక్షకుడుగా నియమించుకున్నాడు.

కొన్నిరోజులు గడిచాయి. ఒకనాడు ధూమకేతు కదంబసేనుడి అభ్యంతర మందిరానికి వెళ్ళాడు. రాజు పక్కనే పాత్రలో పానీయం ఉన్నది. రాజుతో చాకచక్యంగా మాటలు చెబుతూ, తన ఉంగరంలో దాచి ఉంచిన పొడిని పానపాత్రలో వేశాడు ధూమకేతు.



తరవాత కొంతసేపటికి పానపాత్ర చేతిలోకి తీసుకుని తాగబోతూండగా, ఎక్కడినుంచో దండపాణి ఊడిపడి, "మహారాజా, అందులో విషం ఉన్నది. తాగకండి," అంటూ రాజు చేతిలోని పాత్ర తీసేసుకున్నాడు.

"విషమా? ఎవరు కలిపారు?" అన్నాడు రాజు ఆశ్చర్యంగా.

"ఇంకెవరు? తమ అంగరక్షకుడే. అతని ఉంగరం చూడండి," అన్నాడు దండపాణి.

పానీయంలో విషం చేరినట్టు రుజువయింది. రాజు ధూమకేతుకు మరణ దండన విధించాడు. భటులు ధూమకేతును తీసుకుపోయాక, రాజు దండపాణికేసి తిరిగి, "నువు ఖైదులో నుంచి ఎలా తప్పించుకు వచ్చావు? ఈ ధూమకేతు నాకు విషం పెట్టబోతాడని నీకు ముందుగానే ఎలా తెలిసింది? నువు విదేశీ గూఢచారివి కావా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

"మహారాజా, నేను చెరసాల నుంచి తప్పించుకున్నాను. నేను శత్రు గూఢచారినే. ధూమకేతు మీకు విషప్రయోగం చేసేటట్టు ప్రేరేపించినది కూడా నేనే," అన్నాడు దండపాణి.

కదంబసేనుడు మరింత ఆశ్చర్యపడుతూ, "నాకు అంతా అయోమయంగా

ఉన్నది. నన్ను చంపించదలచుకున్న వాడివి, ఎందుకు అడ్డుపడ్డావు?'' అని అడిగాడు.

దండపాణి ఇలా అన్నాడు:

"అంతా వివరంగా చెబుతాను, వినండి. రాజ్యకాంక్ష గల కళింగరాజు మిమ్మల్ని చంపించటానికి నన్ను పంపాడు. నేను మీ అంగరక్షకుడి ఉద్యోగం సంపాదించ టానికి వచ్చాను. అయితే మీ రాజ్యమూ, మీ పరిపాలనా చూశాక నేను ముగ్ధుణ్ణి అయిపోయాను. ఈ రాజ్యాన్ని మా రాజుకు అందించటంకన్న ద్రోహం ఉండదని పించింది. నేను తిరిగి వెళ్ళిపోవటానికి నిశ్చయించుకున్నాను. ఇంతలో ధూమ కేతు ఈ చిన్నఉద్యోగం కోసం నాకు ద్రోహం చేశాడు. అలాటివాడు రేపు పెద్ద ఆశ కనబడితే తమ ప్రాణానికే ఎసరు పెట్టగలడనిపించింది. అది రుజువు చెయ్యటానికి చిన్ననాటకం ఆడాను. నేను ధూమకేతుతో చేతులుకలిపినట్టు నటిం చాను. అతని సహాయంతోనే నేను ఖైదు నుంచి బయటపడ్డాను. తాను తవ్వకున్న గోతిలో తానే పడేటట్టు చెయ్యటానికి అతన్ని మీ మీద విషప్రయోగానికి పురి కొల్పాను. నా ప్రయత్నం ఫలించింది. నా ప్రవర్తనలో దోషం ఏదన్నా ఉంటే తమరు నన్ను తగిన విధంగా శిక్షించ వచ్చు.''

దండపాణి ఉన్నతవ్యక్తి అన్నది రాజుకు స్పష్టమయింది. ఆయన లేచి వచ్చి దండపాణిని కౌగలించుకుని, "నిన్ను నా అంగరక్షకుడుగానే కాక అంతరంగికుడుగా కూడా నియమించు కుంటున్నాను. నువు, నన్నూ, నా రాజ్యాన్నీ కూడా కాపాడావు.'' అన్నాడు.

దానికి దండపాణి, "క్షమించండి, మహారాజా! మీ దగ్గిరచేరి కళింగరాజుకు నమ్మకద్రోహం చెయ్యలేను. వచ్చిన పని నెరవేర్చనందుకు వెనక్కు తిరిగి కళింగ రాజు వద్దకు పోనూలేను. మరే దేశమైనా వెళ్ళి, కొత్తజీవితం నిర్మించుకుంటాను," అని వెళ్ళిపోయాడు.



# అందమైన ఇల్లు

రామేశం, సోమసుందరి అనే దంపతులకు చాలా కాలంగా ఒక అందమైన ఇల్లు కట్టించుకోవాలని ఉండేది. అందుకోసం వాళ్ళు ఎంతో శ్రమపడి, తగినంత డబ్బు కూడబెట్టి, పేరు మోసిన మేస్త్రిని పిలిచి, "ఈ ఊళ్ళో ఎవరికీ లేనంత అందమైన ఇల్లు కట్టించిపెట్టు," అన్నారు.

మేస్త్రి ఇంటికి ఎంత అవుతుందో లెక్కకట్టి, అందులో నగం ముందే తీసుకుని, పని ప్రారంభించి, అందంగా ఇల్లు కట్టేశాడు.

ఇది చూసి, పొరుగున ఉన్న పోతరాజూ, అతని భార్య రంగమ్మా చాలా ఈర్ష్యపడ్డారు. రామేశం ఇంటి పక్కన తమ పెంకుటిల్లు పిడత లాగా ఉన్నది. తమకు కూడా మంచి ఇల్లు కావాలి. కాని డబ్బు? రంగమ్మ తన మెడలో నగలన్నీ అమ్మటానికి సిద్ధపడింది.

పోతరాజు ఆ మేస్త్రినే పిలిచి, రామేశం ఇంటికన్న మంచి ఇల్లు కట్టమన్నాడు. మరి రెండు మాసాలలో పోతరాజు ఇల్లు పూర్తి అయింది. ఊరిలోకెల్లా తమ ఇళ్లే అందమయినవని రామేశమూ, పోతరాజూ కూడా మురిసిపోయారు.

కాని ఒకనాడు వారిద్దరూ అదే ఊళ్ళో తమ ఇళ్ళు రెంటికన్నా అందమైన ఇల్లు చూశారు. అది తాపీమేస్త్రి కొత్తగా కట్టుకున్న ఇల్లు!

—కుమారి కాండూరి భార్గవి





# రాకుమారి లవంగలత

తూర్పు సముద్రంలో ఉన్న స్వర్ణద్వీపపు రాజు ధీమాన్ కుమార్తె లవంగలత చాలా చక్కనిదే గాక, నృత్యమూ, సంగీతమూ, చిత్రలేఖనమూ, ఇంద్రజాలమూ మొదలైన అనేక విద్యలలో ప్రవీణురాలు కూడానూ. ఆమెకు యుక్తవయసు వచ్చేసరికి ఆమె వివాహం ధీమాన్‌కు పెద్ద సమస్య అయి కూర్చున్నది.

ఆయన లవంగలతకు స్వయంవరం ఏర్పాటు చేశాడు. దానికి అనేక దేశాల నుంచి రాజులూ, రాజకుమారులూ వచ్చారు గాని. లవంగలత వారిలో ఎవరినీ వరించలేదు. అది చూసి ధీమాన్ ఆశ్చర్యపడి, ''ఇంతమందిలోనూ నీకు ఒక్కడూ నచ్చలేదా?'' అన్నాడు.

ఆమె సిగ్గుపడుతూ, ''రత్నద్వీప రాజు శశాంకుడు చాలా అందగాడనీ, తెలివి గలవాడనీ, ధీరుడనీ చెబుతారు. నాకు అతనే తగిన భర్త అని నా చెలికత్తెలందరి అభిప్రాయం,'' అన్నది.

''ఈ సంగతి ముందే చెప్పావు కావేం?'' అని రాజు తన మంత్రితో సంప్రతించాడు

స్వర్ణద్వీపం నుంచి రత్నద్వీపానికి సముద్రం మీద వెళ్ళి రావటానికి మూడు నెలలు పట్టుతుంది.

''పెళ్ళి గురించి శశాంకుడి అభిప్రాయం తెలుసుకునేటందుకు మనం ఒక దూతను పంపుదాం. అతని వెంట లవంగలత చిత్తరువూ, టపా పావురాలూ పంపితే, శశాంకుడి అభిప్రాయం మనకు త్వరగా తెలుస్తుంది," అని మంత్రి సలహా ఇచ్చాడు.

మంత్రి చెప్పినట్టుగానే ధీమాన్ తరపున ఒక మనిషి తగిన కానుకలతో సహా రత్నద్వీపానికి బయలుదేరి వెళ్లాడు. అతను బయలుదేరిన యాభై రోజులకు

పావురాలు వార్త తెచ్చాయి. ఆ వార్త ఏమంటే, శశాంకుడు రాచకార్యాలలో మునిగి తేలుతూ ఉండటంచేత అతను స్వర్ణద్వీపానికి రావటం సాధ్యంకాదు; అందుచేత, లవంగలతే రత్నద్వీపం వచ్చే పక్షంలో నిర్ణయం జరగవచ్చు.

వధువును పెళ్ళిచూపులకు పంపటం సంప్రదాయ విరుద్ధమే అయినప్పటికీ, ధీమాన్ తన కుమార్తె కోసం అలా చెయ్యటానికి సిద్ధపడ్డాడు. ఆయన లవంగలత ప్రయాణం కోసం ఒక పెద్ద నౌకను ఆయత్తం చేసి, దాని నిండా వెలలేని కానుకలు నింపి, లవంగలత వెంట తన పురోహితుణ్ణి కూడా రత్నద్వీపానికి పంపాడు.

ప్రయాణం ప్రశాంతంగా సాగింది. నెల దాటిపోయింది. రత్నద్వీపం ఇంకెంతో దూరంలో లేదు. ఇంతలో ఒకరాత్రి ఈ నౌకను సముద్రపు దొంగల పడవలు చుట్టుముట్టాయి. స్వర్ణద్వీపపు భటులు సాహసంతోనే పోరాడినా లాభం లేకపోయింది. యుద్ధంలో సిద్ధహస్తులైన సముద్రపు దొంగలు నౌక మీదికి ఒక్కరొక్కరే ఎక్కరాసాగారు.

లవంగలత రానున్న అపాయం గ్రహించి, గబగబా తన శరీరమంతా నల్ల రంగు పూసుకున్నది; తన నిడుపైన



వెంట్రుకలను పొట్టిగా కత్తిరించుకున్నది. ఆమె పూసుకున్న నల్ల రంగు పదిహేను రోజులదాకా వదలదు. తరవాత ఆమె తన దుస్తులు విప్పేసి, నావికుల దుస్తులు ధరించింది. రాజగురువుతో బాటు ఆమె తాళ్ళగుట్టల వెనక దాక్కొని ఉండగా, సముద్రపు దొంగలు నౌకను తాపీగా కొల్లగొట్టి, నౌక నుంచి తమ పడవలలోకి దిగిపోతూ, నౌక దిగువ భాగంలో బొక్క పెట్టి మరీ వెళ్ళారు. నౌక సముద్రంలో మునిగిపోసాగింది.

నౌక మీద ఒక చిన్న తెప్ప ఉన్నది. నౌకలోవారంతా చచ్చినప్పటికీ, ఇద్దరు నావికులు స్పృహలేని స్థితిలో బతికి



ఉన్నారు. వారికి స్పృహ తెప్పించి, వారితోసహా లవంగలతా, రాజ పురో హితుడూ ఆ తెప్ప పడవలో ఎక్కి కూర్చు న్నారు. నౌక పూర్తిగా మునిగిపోయినాక, ఆ తెప్ప పడవ సముద్రం మీద తేలింది. నావికులు దాన్ని నడుపుతూ, మూడు రోజుల అనంతరం రత్నద్వీపం చేరారు.

లవంగలత రాజగురువునూ, ఇద్దరు నావికులనూ వెంటబెట్టుకుని రాజధానికి పోతూండగా దారిలో రాజుగారి చాకలిది తగిలి, వాళ్ళు వచ్చిన పని తెలుసుకుని, పని పూర్తి అయేదాకా తన ఇంట ఉండమని ఆహ్వానించింది. అందుకు లవంగలత ఒప్పుకున్నది.

ఆ రోజే రాజగురువు శశాంకుణ్ణి కలుసు కుని, లవంగలత వచ్చినట్టు తెలిపాడు. శశాంకుడు ఆమె కోసం పల్లకీపంపి, రాజ భవనానికి తెచ్చుకున్నాడు. చాకలిది లవంగలతకు తన వద్ద ఉన్న మంచి బట్టలు ఇచ్చింది. వాటిని ధరించి లవంగ లత శశాంకుణ్ణి చూడవచ్చింది. ఆమెను చూస్తూనే శశాంకుడు విముఖుడయాడు. రాజవంశంలో అంత నల్లని మనుషులు పుట్టుతారంటే అతను నమ్మలేకపోయాడు. ఆమె ఎవరో మోసగత్తె అనుకుని ఆమెను అతను తిప్పి పంపేశాడు. లవంగలత నిస్పృహతో చాకలిదాని ఇంటికి తిరిగి వచ్చింది.

చాకలిది ఆమెకు ధైర్యం చెప్పింది. ఆ చాకలికి మాలలుకట్టే మనిషి ఒకతె తెలుసు. ఆమె వద్ద జుట్టును శీఘ్రంగా పెంచే తైలం ఉన్నది. పదిహేను రోజులలో లవంగలత ఒంటి నలుపును పోగొట్ట వచ్చు, జుట్టు కూడా పెంచవచ్చు.

రాజభవనానికి మాలలు కట్టి పంపే సురమ అనే మనిషి లవంగలతకు పదిహేను రోజులపాటు పోషణచేసి, మామూలు మనిషిని చేసింది. కాని ఆమెను శశాంకుడి వద్దకు చేర్చేదెలా?

అందుకు ఒక మార్గం లవంగలతే అవలంబించింది. ఆమెకు మాలలు

కట్టడంలో నేర్పు ఉన్నది. ఆమె శశాంకుడి కోసం ఒక మాల ప్రత్యేకంగా తయారు చేసి, సురమ ద్వారా పంపింది. దాన్ని చూసి శశాంకుడు ఆశ్చర్యపోయి, ''ఇన్నేళ్ళూ నువు ఏనాడూ ఇంత అందమైన మాల కట్టలేదు,'' అన్నాడు.

''ఇది నేను కట్టినది కాదు. ఇది ఒక వ్యక్తి ప్రత్యేకంగా తమ కోసం కట్టినది,'' అన్నది సురమ.

నాలుగు రోజులపాటు లవంగలత రకరకాల మాలలు కట్టి శశాంకుడి వద్దకు పంపింది.

''ఈ మాలలు కట్టే మనిషిని నా వద్దకు పంపగలవా? ఎలా కట్టేదీ చూడాలని ఉన్నది,'' అన్నాడు శశాంకుడు.

''మహారాజా, మీకు ఆశాభంగం తప్పదు. ఆమె ఒక పళ్ళెంలో పూలు తీసుకుని, మీ పేరు చెప్పి, వాటి మీద ఊది, ఆ పూలను ఒక పాత్రలో పోసి, అందులో నుంచి మాలను పైకి తీస్తుంది. అలా తయారుచేసిన మాలలు కేవలమూ మీకేనట,'' అన్నది సురమ.

''చిత్రం! చాలాచిత్రం! ఆమెను ఒక సారి చూసి తీరాలి. ఆమెను ఒకరోజు తీసుకురాలేవా?'' అన్నాడు శశాంకుడు.

సురమ ఇంటికి వెళ్ళి లవంగలతతో, ''పాచిక పారింది,'' అని చెప్పింది.



లవంగలత కొన్నిజాజిపూలు తీసుకుని, అందులో సగంపూలతో సాధారణమైన దండ కట్టి, మిగిలినవి ఒక పళ్ళెంలో ఉంచింది. తరవాత ఆమె తాను గుచ్చిన దండ ఎడమ అరచేతిలో ఉంచి, దాని మీద, దండ కనిపించకుండా, పూల పళ్ళెం పెట్టుకుని, రాజభవనానికి బయలుదేరింది. తాను పల్లకీలో రాజభవనానికి వెళ్ళినప్పుడు ధరించిన దుస్తులే ఇప్పుడూ ధరించింది.

ఈసారి లవంగలత కేసి శశాంకుడు మెచ్చుకుంటున్నట్టు చూశాడు. ఆమె రాజ తీవిని కనబరుస్తూ అతన్ని పరామర్శ చేసింది.

"మాలలు ఎలా తయారుచేస్తావో చూపించు," అన్నాడు శశాంకుడు.

"మాలలు సృష్టించే శక్తి నాలో లేదు. నా కోసం దేవుడే మాలలను తయారు చేస్తాడు. అది కూడా నేను అమితంగా ప్రేమించే మనిషి కొరకు కోరితేనే!" అన్నది లవంగలత.

"నా కోసం ఒక మాల తయారు చేయలేవా?" అని శశాంకుడి మంత్రి అడిగాడు.

"క్షమించాలి, అది సాధ్యం కాదు. దేవుడికి నా మనసు తెలుసు. ఆయన నేను అధికంగా ప్రేమించే మనిషి కోసం తప్ప మాల సృష్టించడు," అన్నది లవంగలత.

"నన్ను అధికంగా ప్రేమిస్తున్నానంటావా?" అన్నాడు శశాంకుడు.

"అది దైవనిర్ణయం. తప్పుతుందా?" అన్నది లవంగలత.

"సరే, దైవనిర్ణయాన్ని రుజువు చెయ్యి." అన్నాడు శశాంకుడు.

లవంగలత తన ఎడమచేతిలో ఉన్న పూలపళ్ళెం అతనికి చూపింది. అందులో గుచ్చని జాజిపూలు మాత్రమే ఉండటం అతను చూశాడు. లవంగలత శశాంకుణ్ణి అడిగి ఒక పెద్ద వెండిపాత్ర తెప్పించి, పళ్ళెంలో ఉన్న విడిపూలు అందులో పోస్తూ, పళ్ళెం అడుగున రహస్యంగా దాచిన మాల కూడా అందులోకి జారవిడిచింది.

తరవాత పాత్రలో విడిపూలతో బాటు దండ కూడా కనిపించింది. లవంగలత ఆ దండను పైకి తీసి, చప్పున శశాంకుడి మెడలో వేసింది. శశాంకుడు ఆమెను చూసి, "చిత్తరువులోకన్న ఎంత అందంగా ఉన్నది!" అనుకున్నాడు.

"ఆ మిగిలిన పూల గతి ఏమిటి?" అని అతను అడిగాడు.

"ఒక్క క్షణం ఆగితే నేను వాటిని దండగా గుచ్చుతాను," అన్నది సురమ.

ఆమె గుచ్చిన దండను శశాంకుడు లవంగలత మెడలో వేశాడు!



# 177. అలెగ్జాండరు ప్రతిమ

క్రీస్తుకు పూర్వం నాలుగో శతాబ్దిలో అలెగ్జాండరు ఆసియాను జయించటానికి బయలుదేరబోతూ లిబియాలోని సివా ఒయాసెస్‌కు వచ్చాడు. అప్పుడు సిరీన్‌నగరపు పౌరులు అలెగ్జాండరు వద్దకు తమ ప్రతినిధులను పంపి, అతనికి విధేయతా ప్రమాణం చేశారు. ఈ అపూర్వమైన అలెగ్జాండరు ప్రతిమ సిరీన్‌నగరం వద్ద లభించింది.





# ప్రాప్తం

అరణ్య ప్రాంతంలో ఉన్న ఒక గ్రామంలో సోముడు అనే రైతు ఉండేవాడు. కష్ట పడకుండా సంపాదించాలని అతడి కోరిక. అందుకని అతను వ్యవసాయం విడిచి పెట్టి అరణ్యంలో తిరిగేవాడు.

ఒకసారి సోముడికి అరణ్యంలో ఒక చోట ఒక ముని ధ్యాననిమగ్నుడై కని పించాడు. సోముడు ఆ మునికి నమ స్కారం చేసి, వినయంగా, "స్వామీ, నాకు ధనయోగం ఏ దిక్కులో ఉన్నదో చెబితే, మీ పేరు చెప్పుకుని హాయిగా బతుకుతాను," అన్నాడు.

ధ్యానంలో ఉన్న ముని, పామ్మన్న ట్టుగా చెయ్యి ఊపాడు. తన ధనయోగం తూర్పు దిశలో ఉన్నదని ముని చెబు తున్నట్టు సోముడు అర్థం చేసుకుని, అటుగా బయలుదేరాడు. చీకటి పడిన దాకా నడచినా అడవి తరగలేదు. సోముడు ఏవో దుంపలూ, కాయలూ తిని, ఒక పెద్ద చెట్టెక్కి, దాని మీద నిద్ర పోదామనుకున్నాడు. కాని తెల్లవార్లూ వెర్రి గాలి వీచి, అరణ్యమంతా కల్లోల మయింది. సోముడు నిద్ర పోలేక పోయాడు.

తెల్లవారినాక, అతను చెట్టు దిగి, కొద్ది దూరం నడిచేసరికి, గాలికి వేళ్ళతో సహా పెల్లగిలి పడిపోయిన చెట్టూ, చెట్టు వేళ్ళ సందున ఎవరో పాతిపెట్టిన బంగారమూ కనిపించాయి.

ఆ నాటితో సోముడు లక్షాధికారి అయి పోయాడు.

సోముడి పొరుగున ఉండే వీరన్నకు సంసారం చాలా భారంగా ఉన్నది. అతను కట్టెలు కొట్టి పెళ్ళాన్నీ, నలుగురు పిల్లలనూ పోషించలేక నానా అగచాట్లూ పడుతున్నాడు. అందుచేత అతను

ఎమ్. వి. వి. సత్యనారాయణ

సోముణ్ణి అడిగి అతని రహస్యం తెలుసుకున్నాడు.

సోముడు చెప్పిన గుర్తుల ప్రకారం వీరన్న మునిని వెతుక్కుంటూ వెళ్ళి, మునిని కలిశాడు. ముని ధ్యానంలో లేడు. వీరన్న ముని ముందు సాష్టాంగ పడి లేచి, చేతులు కట్టుకు నిలబడి, సోముడికి సహాయం చేసినట్టుగానే తనకు కూడా ధనయోగం ఎటుగా ఉన్నదీ చెప్పమన్నాడు.

ముని, "సోముడికి నేనేమీ చెప్ప లేదే!" అన్నాడు.

ముని తనకు సహాయం చెయ్య నిరాకరిస్తున్నాడనుకుని వీరన్న, "స్వామీ, పిల్లలు గలవాణ్ణి. ఎంతో కాలంగా దారిద్ర్య బాధతో కుమిలిపోతున్నాను. కరుణించి, నన్ను మీరే రక్షించాలి!" అని బతిమాలాడు.

"పిచ్చివాడా, సోముడికి ప్రాప్తం ఉండి డబ్బు దొరికింది. నీకైనా ప్రాప్తం ఉంటే, నేను దొరకకుండా చెయ్యగలనా?" అని ముని వీరన్న అజ్ఞానానికి నవ్వాడు.

"పోనీ, నాకు ధనయోగం ఉందో, లేదో అదైనా చెప్పండి." అంటూ చెయ్యి చాచాడు వీరన్న.

ముని వీరన్న చెయ్యి చూసి, "నీకు నాలుగో కొడుకు కలగకుండా ఉంటే ధనయోగం సిద్ధించేది. అది కాస్తా తప్పి పోయింది." అన్నాడు.



వీరన్న ఇంటికిపోయి, తన భార్యతో, ''మన నాలుగోవాణ్ణి చంపేస్తే ధనయోగం సిద్ధిస్తుంది,'' అన్నాడు.

వీరన్న భార్య నెత్తీ నోరూ బాదుకుని, మొగుణ్ణి రాక్షసుడని తిట్టింది. భార్యాభర్తలిద్దరూ పోట్లాడుకున్నారు. వీరన్న తన నాలుగో కొడుకును చప్పున ఎత్తుకుని అడవిలోకి పారిపోయాడు. చుట్టుపక్కల వాళ్ళు వీరన్నను తరిమి పట్టుకుని, రాజభటులకు అప్పగించారు

వీరన్నను ఖైదులో పెట్టారు. రోజూ అతన్ని వింతమృగం లాగా చూడటానికి జనం వచ్చి, అతన్ని నానా తిట్లూ తిట్టసాగారు. ధనదాహం తగ్గిపోగానే వీరన్నకు తాను ఎంత భయంకరమైన పని తలపెట్టాడో అర్థమై, పశ్చాత్తాపం కలిగింది.

ఒకరోజు ముని వచ్చి, న్యాయాధికారితో, ''వీరన్న కొడుకును చంపటానికి సిద్ధపడ్డాడంటే దానికి కారణం, నా మాటలను అతను సరిగా అర్థం చేసుకోలేదు. అతన్ని విడిచిపెట్టవచ్చు,'' అన్నాడు.

ముని మాటమీద వీరన్నను విడిచిపెట్టారు. ముని అతనితో, ''నీకు నిజంగా ధనయోగం కలగాలంటే—'' అని ఏదో చెప్పబోయాడు.

వీరన్న చెంపలు వేసుకుని, ''స్వామీ, నాకు ఏ యోగమూ అవసరం లేదు. నన్ను ఖైదులో పెట్టిన తరవాత నా భార్యా, బిడ్డలూ ఎలా బతుకుతున్నారోనని చాలా దిగులుపడి ఉన్నాను. నా రెక్కల కష్టం నాకు చాలు,'' అన్నాడు.

ముని నవ్వి, ''ఎందుకొచ్చిన ధనయోగం? సోముడి గతి ఎలా ఉన్నదో చూశావా? అతడికి పాపం మనశ్శాంతి లేదు. అతని కాలమంతా డబ్బుకు కాపలా కాయటంతోటే సరిపోతున్నది. బంధుమిత్రులను తృప్తిపరచలేక, వాళ్ళ అసూయను సహించలేక పిచ్చెత్తిపోతున్నాడు. తన భార్య తన సొత్తును పుట్టింటి వాళ్లకు దోచిపెట్టుతుందేమోనని మరొక భయం! అతనికంటె నువు ఎంతో సుఖప్రాణివి!'' అన్నాడు.





# పనికిమాలిన ప్రోత్సాహం

పల్లవరం గ్రామంలో రామయ్యా అనే ధనికుడు ఉండేవాడు. అతని తల్లి ప్రవర్తన వింతగా ఉండేది. ఆమెకు బిచ్చగాళ్ళంటే అమిత అసహ్యం; కాని ఆమె ఇద్దరు కుర్రబిచ్చగాళ్ళకు రోజూ రెండుపూటలా తిండి పెట్టుతూండేది.

ఇది గమనించి రామయ్యా తన తల్లి ప్రవర్తనకు కారణం అడిగాడు. ఆ కుర్ర వాళ్ళ తాతముత్తాతలు మంచి ధనికులనీ, రామయ్యా తాత చేసిన దుర్మార్గం వల్ల వాళ్ళ కుటుంబం పూర్తిగా చితికిపోయి, వాళ్ళు దరిద్రులయారనీ రామయ్యతల్లి చెప్పింది.

ఇది విని రామయ్యా గుండె ద్రవించింది. తమ కుటుంబం వల్ల ఆ కుర్రవాళ్ళకు జరిగిన అన్యాయం సరికావాలనీ, అలా చేసే బాధ్యత తనమీద ఉన్నదనీ ఆయన అనుకున్నాడు.

వెంటనే రామయ్యా ఆ కుర్రవాళ్ళ తల్లిని చూడబోయాడు. ఆమె చాలా దీన స్థితిలో ఉన్నది. తన బిడ్డలు చాలామంది వైద్యసహాయం లేక పోయారనీ, ఈ ఇద్దరు కొడుకులు మాత్రమే బతికి బట్టకట్టారనీ ఆమె చెప్పింది. ఆమె అడుక్కుని బతుకుతున్నది. రామయ్యా ఆమెను అడుక్కోవటం మానమని చెప్పి, కొంత డబ్బు ఇచ్చాడు; నెలనెలా ఆమెకు కావలసిన డబ్బు ఇస్తాననీ, ఆమె కొడుకులను చదివించి ప్రయోజకులను చేస్తాననీ మాట ఇచ్చాడు.

కుర్రవాళ్లలో పెద్దవాడి వయసు తొమ్మిదేళ్ళు, పేరు శంకరయ్యా. రెండోవాడు భీమయ్యాకు ఏడేళ్ళు. రామయ్యా చేస్తున్న ధన సహాయంతో ఆ ఊళ్ళో ఒక పాఠశాల నడుస్తున్నది. ఆ పాఠశాలలో పనిచేసే ఉపాధ్యాయుడికి రామయ్యా కుర్రవాళ్లను అప్పగించి, వాళ్లకు చదువుచెప్పమన్నాడు.

"వసుంధర"




అయితే వాళ్ళకు చదువు మీద శ్రద్ధ లేదు. కొద్దిపాటి అక్షరజ్ఞానం కలగటానికి వాళ్ళకు ఏడాది పట్టింది. ఉపాధ్యాయుడు ఈ మాట చెబితే రామయ్య, "పాపం, వాళ్ళు పెరిగిన వాతావరణం అంత మంచిది కాదు. వీళ్లని మిగతా విద్యార్థులతో కలిసి చదవనియ్యండి," అన్నాడు.

అయిదేళ్ళు గడిచాయి. మిగతా విద్యార్థులు చదువు పూర్తిచేసి, ఏవో వృత్తి విద్యలు నేర్చుకోవటానికి వెళ్ళిపోయారు. ఆ పాఠశాలలో వాళ్ళ చదువు ముగిసింది.

"శంకరయ్యా, భీమయ్యా మరో అయిదేళ్ళు చదివితే గాని వాళ్ళ చదువు పూర్తి కాదు," అన్నాడు ఉపాధ్యాయుడు.

"అలా చేస్తే వాళ్ళకు ప్రోత్సాహం ఉండదు. వాళ్ళు, పైకిరాలేని వాతావరణంలో పెరిగారు," అన్నాడు రామయ్య.

ఆయన అడిగితే, శంకరయ్య తనకు వైద్యుడు కావాలని ఉన్నట్టు చెప్పాడు. రామయ్య వాణ్ణి ఒక పేరుమోసిన వైద్యుడి వద్దకు తీసుకుపోయి, వాడికి వైద్యశాస్త్రం నేర్పమన్నాడు.

వైద్యుడు శంకరయ్యను పరీక్షించి, "ఈ అబ్బాయికి మామూలు చదువేరాదు. బాగా చదువుకోమనండి," అన్నాడు.

"అలా అనకండి. మీరు తలుచుకుంటే వాణ్ణి వైద్యంలో ఉద్దండుణ్ణి చెయ్యగలరు. వీడికి వైద్యశాస్త్రం నేర్పితే మీకు మంచి బహుమానం ఇస్తాను," అన్నాడు రామయ్య.

వైద్యుడు బహుమానానికి ఆశపడి, తన దగ్గిర ఉన్న శిష్యులలో ఒకణ్ణి పంపేసి, వాడి స్థానంలో శంకరయ్యను తీసుకున్నాడు. అలా బయటికిపోయిన శిష్యుడు రామయ్యతో మొరపెట్టుకున్నాడు.

"నీకేం? సంస్కారమున్న ఇంట పుట్టావు. ఎలాగైనా బతకగలవు," అన్నాడు రామయ్య.

భీమయ్య ఇళ్ళు కట్టించే పని నేర్చుకోవాలన్నాడు. రామయ్య వాణ్ణి ఒక వాస్తు శాస్త్రప్రవీణుడి వద్దకు తీసుకుపోయి,

వాడికి ఆ శాస్త్రం నేర్పమన్నాడు. కాని ఆ ప్రవీణుడు భీమయ్యను పరీక్షించి, వాడికి ఉన్న చదువు చాలదన్నాడు.

''శ్రద్ధగా నేర్పితే ఎవడికైనా ఏ విద్య అయినా వస్తుంది. నేను డబ్బిస్తాను. వాడికి వాస్తుశాస్త్రం నేర్పండి. కాస్త నింపాదిగా నేర్చుకుంటాడు. అంతకన్న ఏముంది?'' అన్నాడు రామయ్య.

ఇద్దరూ పదేళ్ళపాటు తాము నేర్చుకునేదేదో నేర్చుకున్నారు. రాజుగారి దివాణంలో వాళ్ళకు ఏవైనా ఉద్యోగాలు దొరుకుతాయేమో అని రామయ్య చూశాడు. కాని ప్రయోజనం లేకపోయింది. వైద్యంలోనూ, వాస్తులోనూ కూడా మెరికల్లాటి యువకుల పోటీ హెచ్చుగా ఉన్నది.

అది చూసి రామయ్య రాజుగారిని కలుసుకుని, తమ గ్రామానికి ఒక ప్రభుత్వ వైద్యుడూ, భవన నిర్మాతా అవసరంగా కావాలనీ, ఆ రెండు ఉద్యోగాలూ మంజూరు చెయ్యమనీ వేడుకున్నాడు. రాజుగారు సరేనన్నాడు.

రామయ్య తన ఊరికి తిరిగివచ్చి, గ్రామాధికారికి రాజుగారి ఫర్మానా చూపి, ఆ ఉద్యోగాలకు మనుషులు కావాలని చాటింపు వేయించమన్నాడు.

చాటింపు విని వైద్యంలోనూ, వాస్తులోనూ మంచినైపుణ్యం ఉన్నట్టు శిఫార్సులతో అనేకమంది వచ్చారు. వారితో బాటు శంకరయ్యా, భీమయ్యా కూడా వచ్చారు.



''మనం వెనుకబడిన వాళ్ళకు ప్రోత్సాహం ఇవ్వటం అవసరం. అందుచేత శంకరయ్యను గ్రామవైద్యుడుగానూ, భీమయ్యను భవననిర్మాతగానూ నియమింతాం,'' అన్నాడు రామయ్య గ్రామాధికారితో. గ్రామాధికారి కాదనలేకపోయాడు.

త్వరలోనే శంకరయ్య వైద్యం గ్రామస్థులకు ప్రమాదకరమని తోచింది. వారి ఫిర్యాదులను రామయ్య పెడచెవిన పెట్టాడు. పోతే, భీమయ్యకు ఇల్లు కట్టించే అవకాశం వెంటనే రాలేదు. అందుచేత రామయ్య అతని చేత తన దొడ్డిలోనే ఒక

చిన్న డాబాఇల్లు కట్టించాడు. అది చూసి భీమయ్య చేత అందరూ ఇళ్ళు కట్టించు కుంటారని రామయ్య ఉద్దేశం.

ఒకరోజు రామయ్య ఆఖరికొడుకు గోపాలుడు అనేవాడు కొత్తఇంట్లో తిరుగు తూండగా ఒకభాగం కూలింది. కుర్రాడి మీద ఇటుకలు పడ్డాయి. వాడు పెద్దకేక పెట్టి పడిపోయాడు. కుర్రాణ్ణి వెంటనే శంకరయ్య దగ్గిరికి తీసుకుపోయారు.

నాలుగురోజుల పాటు శంకరయ్య చికిత్స చేసినా కుర్రాడు బాగుపడలేదు. వాడే రామయ్య దగ్గిరికి వెళ్ళి, "బాబు గారూ, అబ్బాయిని మరొక వైద్యుడికి చూపిస్తే బాగుంటుంది," అన్నాడు.

రామయ్య కంగారుగా తన కొడుకును నగరంలో శంకరయ్య గురువు వద్దకు తీసుకుపోయాడు. ఆయన వైద్యంతో గోపాలుడు కోలుకున్నాడు.

కొడుకును ఇంటికి తీసుకుపోతూ రామయ్య వైద్యుడితో, "స్వామీ, శంకరయ్యనూ, వాడి తమ్ముణ్ణీ వృద్ధిలోకి రావటానికి ఎంతగానో ప్రోత్సహించి చూశాను. నా ప్రయత్నం బూడిదలో పోసిన పన్నీరు అయింది. కారణం ఏమంటారు?" అన్నాడు.

వైద్యుడు నవ్వి, "మీ ప్రోత్సాహమే వాళ్ళకు ప్రతిబంధక మయింది. దాని మూలంగా వాళ్ళు తమ స్థాయిని పెంచుకునే ప్రయత్నం ఏమీ చెయ్యలేదు. మీరు వాళ్ళకు ప్రోత్సాహం ఇయ్యదలిస్తే ఆర్థికంగా సహాయం చెయ్యవచ్చు. మాటలతో ప్రోత్సహించవచ్చు. కాని వారి విషయంలో ప్రత్యేకతలు చూపకూడదు. అలా చూపటం వల్ల ప్రజలను అనర్థులబారికి వదలటమేగాక కొందరు అర్హతగలవారిని నిరుత్సాహపరచడం కూడా జరిగింది," అన్నాడు.

రామయ్య తన తప్పు గ్రహించి, శంకరయ్యనూ, భీమయ్యనూ తిరిగి విద్యాభ్యాసంలో పెట్టాడు. మరో అయిదేళ్లు శిక్షణ పొందినాక వాళ్లు తమ తమ విద్యలలో నిజంగానే ప్రవీణులయారు.





# వెర్రిబాగులవాళ్ళు

పాకాలయ్య అనేవాడు పనికోసం చాలా ఊళ్ళు తిరిగి, ఒక చిన్నగ్రామం చేరాడు. ఆ ఊళ్ళో అందరూ వెర్రిబాగులవాళ్ళే.

పాకాలయ్యకు ఊరి మొదట్లోనే ఒక దృశ్యం కనిపించింది. ఒకడు దున్నను దుడ్డుకర్రతో కొట్టుతూ, "త్వరగా దూడని ఈనవే!" అని కేకలు పెట్టుతున్నాడు.

కట్టివేసి ఉన్న దున్న అటూ, ఇటూ తప్పుకోజూస్తూ అరుస్తున్నది. "నాకీబేరం అక్కర్లేదు. నిన్ను తిరిగి ఇచ్చేసి, నా వంద రూకలు నేను తెచ్చుకుంటాను," అన్నాడు వాడు, దాని కట్టుతాడు ఊడదీస్తూ.

దున్న తన పాత యజమాని వద్దకు పరుగు తీసింది. దాని వెనకే పరిగెత్తాడు ఆ మనిషి. పాకాలయ్య కూడా ఆ మనిషి వెనకే వెళ్ళాడు, ఏం జరిగేదీ చూతామని.

అంతకుముందు రోజే నాగన్న అనేవాడు ఆ దున్నను ఆ మనిషికి అమ్మాడు. ఇప్పుడా మనిషి నాగన్న దగ్గిరికి వచ్చి, "అర్థరాత్రి లోపల అది దూడను పెట్టితీరుతుందని మాట ఇచ్చావు. దాన్ని నువే ఉంచుకుని, నా వంద నాకు పారెయ్యి," అన్నాడు.

నాగన్న ఆ దున్నతోక పట్టుకుని చూసి, "ఇది నేను నీకు అమ్మింది కాదు. నువు మరొకదాన్ని నాకు అంటగట్టాలని చూస్తున్నావు. నిన్న అమ్మినప్పుడు దీని తోక చివర ఒక జోరీగ ఉండాలి. ఇప్పుడు లేదు," అన్నాడు కచ్చితంగా.

"అప్పుడు సరిగా చూశావో, లేదో. ఇది నీ దున్నే! అబద్ధాలు చెప్పడం మా ఇంటా వంటా లేదు," అన్నాడు ఆ మనిషి.

"అబద్ధాలు చెప్పటం మా ఇంట్లో వాళ్ళకే అలవాటనా నీ ఉద్దేశం?" అంటూ నాగన్న గొంతుపెంచాడు.

ఇద్దరూ చాలాసేపు మాటకు మాట అనుకున్నారు. ఈ గోలకి నలుగురూ

ఎం. కామేశ్వరరావు

పోగయి, '' మాటలతో ఎంతసేపు దెబ్బలాడుకుంటారు? కత్తులో, కర్రలో తీసుకోండి,'' అని ఇద్దరికీ చెరో కర్రా ఇచ్చారు.

కర్రలతో యుద్ధం మొదలయింది. ఇద్దరిలో ఎవరికీ దెబ్బలు తగలలేదు గానీ, పుచ్చిపోయి ఉన్న ఆ కర్రలు మాత్రం విరిగిపోయాయి.

'' పోనీ కదా అని కర్రలు ఇస్తే విరగగొట్టి పెడతారా? '' అంటూ కర్రలు యిచ్చిన వాళ్ళు ఆ ఇద్దర్నీ మెత్తగా తన్నారు.

ఇద్దరి బట్టలూ మట్టి కొట్టుకున్నాయి.

"ఇంత మంది కలిసి ఇద్దర్ని చావ బాదుతారా? మాకు న్యాయం జరగక పోదు. న్యాయాధికారి దగ్గిరికి వెళతాం,'' అని ఆ ఇద్దరూ స్నానం చేసి, మాసిన బట్టలు విప్పేసి ఉతికిన బట్టలు కట్టుకుని, న్యాయాధికారి దగ్గిరికి వెళ్ళి, తమకు జరిగిన అన్యాయం గురించి చెప్పారు.

న్యాయాధికారి అంతా విని, '' ఏదీ? మీరు ముందు కర్రలతో బాదుకున్నామన్నారు. తరవాత అంతా కలిసి మిమ్మల్ని దుమ్ములో పడేసి చావ బాదారన్నారు. మీ ఒంటి మీద అటువంటి చిహ్నాలు ఏమీలేవు. ఇక్కడ సాక్ష్యం లేకుండా ఏమీ జరగదు.'' అని, తన మనుషుల చేత వారిద్దరినీ బాదించి, మట్టిలో పొర్లించి, '' ఆc! ఇక చెప్పండి.'' అన్నాడు.

ఇంక చెబితే ఎన్ని దెబ్బలు తినాలో అనుకుని, వాళ్ళిద్దరూ తమ ఫిర్యాదును ఉపసంహరించుకుని, ఇంటిదారి పట్టారు.

పాకాలయ్య ఆ ఇద్దర్నీ భుజం తట్టుతూ, ''చిన్న విషయానికి పెద్ద రాద్ధాంతం చేసి, అనవసరంగా కష్టాలు కొనితెచ్చుకున్నారు. అది ఈనడం ఆలస్యమయింది. అంతే కదా? ఇవాళ కాకపోతే రేపయినా అది తప్పకుండా ఈని తీరుతుంది. ఈ మాత్రం దానికి తగువు దేనికి? ఇకనైనా ఇద్దరూ కలిసి కట్టుగా ఉండండి,'' అని హితవు చెప్పాడు.

ఆ వెర్రిబాగులవాడికి ఆ ఊళ్ళో తప్పకుండా పని దొరుకుతుంది!





# వింత తాకట్టు

పూర్వం మాంచాలదేశాన్ని పాలించిన ఉదయసేనుడికి సంగీత మంటే తగని పిచ్చి. ఆయన ఆస్థానంలో చాలామంది గాయకులు ఉండేవారు. కాని అందరి కన్న ఉదయసేనుడి దృష్టిలో గొప్పవాడు కృష్ణశాస్త్రి; ఆయన ఆస్థానసంగీత విద్వాంసుడుగా ఉండ నిరాకరించాడు.

కృష్ణశాస్త్రి ఏ మంత ధనికుడు కాడు. ఆయన వేణుగానంలో సాటిలేని విద్వాంసుడు. ఆయన వేణుగానం అంటే రాజుకు అన్నిటి కన్న ఎంతో ఇష్టం. ఆయనను ఆస్థాన గాయకులందరికీ పెద్దగా నియమించాలని రాజు ఎంతో ఉబలాటపడ్డాడు. కాని అందుకు కృష్ణశాస్త్రి ఒప్పుకోలేదు.

''మహారాజా, కళను అమ్ముకోలేను. తమవంటి శ్రోత ఉంటేనే నా కళకు సార్థక్యం ఉంటుంది. మీరు ఏ వేళ రమ్మన్నా వచ్చి సంగీతం వినిపిస్తాను. నాకు మాత్రం ఉద్యోగం కన్న స్వేచ్ఛ ప్రధానం. గానానికి సంబంధం లేకుండా తమ ఆస్థానంలో ఏ ఉద్యోగం ఇచ్చినా సంతోషంగా చేస్తాను. ఆస్థాన విద్వాంసుడుగా మాత్రం ఉండలేను,'' అన్నాడాయన రాజుతో.

సంగీతం పట్ల ఎంతో అభిమానం గల రాజు కృష్ణశాస్త్రి మనసు గ్రహించి మెచ్చుకున్నాడు. అంతటి మహా విద్వాంసుడికి మరొక ఉద్యోగం ఇవ్వటం అపచారమవుతుందని రాజు నమ్మాడు. ఆయన కృష్ణశాస్త్రిని తన మిత్రుడుగా ఉంచుకుని, అప్పుడప్పుడూ ఆయన వేణుగానం విని ఆనందిస్తూ, అవకాశం దొరికినప్పుడల్లా కృష్ణశాస్త్రికి బహుమానాలు ఇస్తూ వచ్చాడు.

రాజు వేటకు వెళ్ళినప్పుడు కృష్ణశాస్త్రిని వెంట బెట్టుకు వెళ్ళేవాడు. కృష్ణ

కూరపాటి జగన్నాథం

శాస్త్రి వేణుగానం వినగానే పెద్దపులుల లాటి క్రూరమృగాలు కూడా నిలిచి ఆల కించేవి. ఈ కారణంవల్ల రాజుకు వేట బాగా సాగేది.

ఏటా నవరాత్రి పూజలప్పుడు దివా ణంలో సంగీతోత్సవం జరిగేది. అందులో కృష్ణశాస్త్రి వేణుగానం అన్ని గానాలలోకీ ప్రశస్త మైనది. రాజుగారు తన ఆస్థాన విద్వాంసుల కన్న కృష్ణశాస్త్రిని రెట్టింపుగా సత్కరించేవాడు.

ఈ కారణం చేత ఆస్థాన సంగీత విద్వాంసులకు కృష్ణశాస్త్రి మీద అమిత మైన అసూయ ఉండేది. అయితే వాళ్ళు కృష్ణశాస్త్రిని ఏమీ చేయలేక పోయారు. పై పెచ్చు, రాజుగారిని అనుకరిస్తూ, వాళు ఆయన పట్ల ఎంతో గౌరవ భావమూ, స్నేహభావమూ కనబరిచేవారు.

కృష్ణశాస్త్రికి పెళ్ళియీడు వచ్చిన కుమార్తె ఉన్నది. ఆమె పేరు చంద్రరేఖ. ఆమె గుణశర్మ అనే యువకుణ్ణి ప్రేమిం చింది. అతని తండ్రి విష్ణుశర్మ ఆస్థానంలో ఉద్యోగి. కృష్ణశాస్త్రి మాట వరసగా విష్ణుశర్మతో తన కూతురిని అతని కొడుకు కిచ్చి పెళ్ళి చెయ్యటం గురించి అన్నాడు. విష్ణుశర్మ అభ్యంతరం చెప్పలేదు.

ఈ సంగతి ఆస్థానగాయకులకు తెలి సింది. కృష్ణశాస్త్రి మీద దెబ్బతీయటానికి వాళ్ళు ఒక పథకం పన్నారు.

కొందరు విష్ణుశర్మ వద్దకు వెళ్ళి, "నీ కొడుకు చాలా అదృష్టవంతుడు.



కృష్ణశాస్త్రి మంచి కట్నం ఇస్తాడు. అతని కేం? రాజుగారు కల్పవృక్షంలాగా ఆయన వెనక ఉన్నారు,'' అన్నారు.

విష్ణుశర్మకు ఆశపుట్టింది. కృష్ణశాస్త్రి అతనితో నిశ్చితార్థం చేసుకుందా మని అన్నప్పుడు, విష్ణుశర్మ తన కొడుక్కు వెయ్యివరహాలు కట్నం ఇయ్యవలసి ఉంటుందని హెచ్చరించాడు.

కృష్ణశాస్త్రికి ఏం చెయ్యాలో తోచలేదు. ఆ పరిస్థితిలో ఆస్థానగాయకులు ఆయనను చూడబోయి, ''మీ చంద్రరేఖను విష్ణుశర్మగారి కొడుకు గుణశర్మ కిచ్చి చెయ్యటానికి నిశ్చయించారని తెలిసింది, శుభం! మీరు చాలా అదృష్టవంతులు,'' అని అభినందించారు.

''నిజమే, కాని వరకట్నం వెయ్యివరహాలు ఎక్కడి నుంచి తేవాలో తెలియటం లేదు. నాకు ఈ ఇల్లు తప్ప వేరే ఆస్తి లేదు. అది తాకట్టు పెట్టాలి. దాని మీద అంత సొమ్ము ఎవరు అప్పుగా ఇస్తారో తెలీదు,'' అన్నాడు కృష్ణశాస్త్రి విచారంగా.

''దాన్నిగురించి మీరు విచారించకండి. బంగారుశెట్టి మనవాడే. అతనితో చెప్పి, మీకు కావలిసిన సొమ్ము అప్పు ఇచ్చేటట్టు మేం చూస్తాం,'' అన్నారు ఆస్థాన గాయకులు.

కృష్ణశాస్త్రికి ప్రాణం లేచివచ్చింది. ఆయన వారికి తన కృతజ్ఞత తెలుపుకుని, మర్నాడే బంగారుశెట్టి వద్దకు వెళతా నన్నాడు.



ఆస్థానగాయకులు బంగారు శెట్టితో చెప్పవలసినది చెప్పారు. అందుచేత, మర్నాడు కృష్ణశాస్త్రి తన వద్దకు వచ్చి అప్పుమాట తీసుకురాగానే, అతను, ''అయ్యా, మీరు కోరిన సొమ్ము అప్పుగా ఇస్తాను. కాని నాకు తాకట్టు కింద మీ ఇల్లు అవసరం లేదు. మీ వేణుగానాన్ని గురించి గొప్పగా విన్నాను. దాన్ని తాకట్టు పెట్టి సొమ్ము పుచ్చుకోండి," అన్నాడు.

కృష్ణశాస్త్రి నిర్ఘాంతపోయి, ''అంటే?'' అని అడిగాడు.

''ఏమీ లేదు. మీరు నా బాకీ తీర్చేదాకా ఎక్కడా వేణువు వాయించరాదు. అంతే!" అన్నాడు బంగారుశెట్టి.

కృష్ణశాస్త్రి అందుకు సమ్మతించి, శెట్టికి తాకట్టు పత్రం రాసి ఇచ్చి, కావలిసిన డబ్బు పుచ్చుకున్నాడు. ఆ డబ్బుతో చంద్రరేఖ పెళ్ళి సవ్యంగా జరిగిపోయింది.

తరవాత నవరాత్రులు వచ్చాయి. రాజుగారు ఈ ఏడు కూడా పెద్దపండుగ రోజున కృష్ణశాస్త్రికి వేణుగానం చెయ్యవలిసి ఉంటుందని కబురుచేశాడు.

కృష్ణశాస్త్రి రాజుగారిని కలుసుకుని, ''మహారాజా, ఈ యేడు నేను వేణువును తాకను. పరిస్థితి బాగుంటే వచ్చే ఏడు చూసుకుందాం,'' అన్నాడు

రాజు ఆశ్చర్యపోయి, ''అదేమిటి? మీ వేణుగానం లేకుండా నవరాత్రులు ఎలా జరుగుతాయి? మీ రెందుకు నిరాకరిస్తున్నారు,'' అని అడిగాడు.

కృష్ణశాస్త్రి జరిగినదంతా చెప్పాడు.

కృష్ణశాస్త్రి మీదనే గాక, తన మీద కూడా కుట్ర జరిగిందని గ్రహించటానికి రాజుకు క్షణం కూడా పట్టలేదు. ఆయన బంగారుశెట్టిని పిలిచి, నిలవదీసి అడిగేటప్పటికి, ఈ కుట్రకు మూలకారకులు తన ఆస్థాన విద్వాంసులన్న సంగతి బయటపడింది. ఆయన బంగారుశెట్టికి శిక్ష కింద తాకట్టుపత్రం తీసుకుని, మరే శిక్షలేకుండా వదిలాడు. కాని ఆస్థాన గాయకులందరికీ ఉద్యోగాలు ఊడాయి.



# వెంటరాని సొత్తు

ఒక ధనవంతుడు పరమ లోభి. జీవితమంతా డబ్బు కూడబెట్టటంలోనే గడిపాడు.

ఒకనాడు ఒక సన్యాసి ఆ ధనవంతుని దగ్గిరికి వచ్చాడు. సన్యాసిని చూడగానే ధనవంతుడు చిరాకుపడి, ఏ ధర్మకార్యానికో ధనసహాయం చేయమంటాడని ఊహించి, "ప్రస్తుతం నా వద్ద ఏమీ లేదు. తరవాత చూతాం," అన్నాడు.

సన్యాసి నవ్వి, ధనవంతుడితో, "అయ్యా, నేను యాచనకు రాలేదు. చిన్న సహాయం కోరి వచ్చాను. ఈ సూదిని ఈ జన్మలో భద్రపరిచి, వచ్చే జన్మలో నాకు ఇయ్యండి," అన్నాడు.

ధనికుడు విరగబడి నవ్వి, "మీకు మతి సరిగా లేనట్టున్నది. ఈ సూదిని మరొక జన్మకు ఎలా మోసుకు పోగలను?" అన్నాడు.

"ఈ సూదినే వెంట తీసుకుపోలేని మీరు ఈ సంపాదించిన ఆస్తినంతా ఏం చేయదలచారు?" అని సన్యాసి అడిగాడు.

ధనవంతుడి కళ్ళు విచ్చుకున్నాయి. ఆయన దానధర్మాలు చెయ్యటం ప్రారంభించి మంచి పేరు తెచ్చుకున్నాడు.

—కే. వి. ఎస్. రాజశేఖర్





# భక్తుడైన దొంగ

రహీం అనే ధనవంతుడికి ఒక్కగాను ఒక్క కూతురు రజియా చాలా అందమైనది. రహీంకు గల ఆస్తి పది తరాల పాటు తిన్నా తరిగేది కాదు.

రహీం దైవభక్తి గలవాడు. అతని దినచర్య ఐదుపూటలా నమాజ్ చేయటమూ, ఖురాన్ చదవటమూనూ. అల్లాపేరిట తన ప్రాణాన్నయినా ఇచ్చేటంతటి దైవభక్తి గలవాడు అతను.

రజియాకు యుక్తవయసు రాగానే ఎంతోమంది ధనవంతులు ఆమెను వివాహమాడేటందుకు ప్రయత్నించారు. కాని వారిలో దైవభక్తి కలవాడు ఒక్కడూ కనిపించలేదు రహీంకు. ఆయన తన కుమార్తెను దైవభక్తి గలవాడికే ఇయ్యాలని నిర్ణయించుకున్నాడు.

ఒకరోజు రాత్రి రహీం భార్య సుల్తానా తన భర్తతో, "చూడండి, మన అమ్మాయికి ఎన్నో మంచి సంబంధాలు వస్తున్నాయి. ఎంతోమంది ధనవంతులు వస్తున్నారు, కాని మీకు ఒక్క సంబంధమూ నచ్చలేదు. ఇలా అయితే అమ్మాయికి వివాహం ఎలా అవుతుంది?" అని ఎంతో దిగులుతో అన్నది.

"పిచ్చిదానా, మనకు ఎంతో ధనం ఉన్నది. మన అమ్మాయిని ధనవంతుడికి ఇయ్యాలన్న కోరిక నాకు లేదు. బీదవాడయినప్పటికీ, బుద్ధిమంతుడూ, దైవభక్తి గలవాడూ అయినవాడి కోసం చూస్తున్నాను. అల్లా కృప వల్ల నా కోరిక ఫలించకపోదు," అన్నాడు రహీం తన భార్యతో.

ఆ రాత్రి రహీం ఇంట దొంగతనం చెయ్యటానికి వచ్చిన నసీర్ అనే వాడు భార్యాభర్తల సంభాషణ అంతా విన్నాడు. మర్నాడు ఉదయం, రహీం నమాజ్‌కని

ఎం. ముంతాజ్ బేగం

మసీదుకు వెళ్ళే సమయం గమనించి, అతని కన్న ముందే అతను మసీదు చేరి, వచ్చీ రాని నమాజ్ చదువుతున్నట్టు నటించసాగాడు.

రహీం తాను మసీదుకు వచ్చినప్పుడల్లా ఆ దొంగ ఎంతో భక్తితో నమాజ్ చేస్తూం డటమూ, మసీదులోనే పడుకుంటూ ఉండటమూ గమనించి, నసీర్‌ను, "మీదే వూరు, నాయనా? పదిరోజులుగా నువు మసీదులోనే గడపటం చూస్తున్నాను," అని అడిగాడు.



అందుకోసమే ఎదురుచూస్తున్న దొంగ, "నాకు ఒక ఊరని ఏమీ లేదండి. నాకు తల్లీ, తండ్రీ, లేరు. అల్లాను ధ్యానిస్తూ రోజులు గడపటమే నా పని," అన్నాడు.

"అయితే నువు ఎక్కడ భోజనం చేస్తున్నావు?" అని రహీం అడిగాడు.

"భగవంతుణ్ణి ధ్యానిస్తూ ఉంటే నాకు ఆకలీ, దప్పీ తెలియదు. ఏ రాత్రికో ఆకలి అనిపిస్తే, అల్లా కృప వల్ల ఎవరో ఒకరు నా ఆకలి తీర్చుతున్నారు. దైవ భక్తే చాలు నా కడుపు నిండటానికి," అని నసీర్ బొంకాడు.

నిజానికి, ఎప్పుడూ మసీదులోనే ఉంటున్నాడనీ, పుణ్యాత్ముడనీ, ఊరి వాళ్ళు అతనికి తినటానికి ఏదో ఒకటి పంపుతూనే ఉన్నారు.

దొంగ మాటలు రహీం నమ్మి, నిజమైన దైవభక్తి అంటే అతనిదే అనుకున్నాడు. "ఇంత చిన్న వయసులో ఎంత దైవభక్తి! పైగా అందగాడూ, బుద్ధిమంతుడూనూ. అల్లా కృప వల్ల ఈ నాటికి నా కోరిక తీరింది. నా కుమార్తెకు తగిన భర్త ఇతనే! ఇతనికే పిల్లనిచ్చి చేస్తాను," అని రహీం నిశ్చయించుకున్నాడు.

ఆయన దొంగకు ప్రతిరోజూ తన ఇంటి నుంచి పంచభక్ష్య పరమాన్నాలు పంపించ సాగాడు.

ఇలా నలభై రోజులు గడిచేసరికి దొంగ నిజంగానే దైవభక్తిలో లీనమయాడు. రహీం పంపే తిండి తింటూ, రోజూ దైవ



51

ప్రార్థన చేస్తూ, పెద్దలు చెప్పే నీతి బోధలు వింటూంటే అతనిలో నిజంగానే మార్పు వచ్చింది. అతనికి తాను గడుపు తున్నదే ఉత్కృష్ట జీవితం అనిపించింది. అతను తాను చేసిన దొంగతనాలూ, పాపాలూ తలుచుకుని, ధ్యానంలో ఉన్నప్పుడు ఏడ్చేవాడు.

రహీం ఒక రోజు అతనితో, ''నాయనా, నిన్ను చూస్తూంటే నా కెంతో సంతోషంగా ఉన్నది. నీలాటి భక్తుడి కోసమే చూస్తూ, ఇన్నాళ్ళూ నా కుమార్తెకు వివాహం చెయ్యలేదు. నువు నా కుమార్తెను చేసు కుంటే సంతోషిస్తాను,'' అన్నాడు.

ఈ మాటలు వినగానే దొంగ రహీం కాళ్ళ మీద పడి, ఏడుస్తూ, ''నన్ను క్షమించండి, బాబూ. నేను దొంగను. ఒక రోజు మీ ఇంటికి దొంగతనానికి వచ్చి, మీ భార్యాభర్తల సంభాషణ విని, మిమ్మల్ని మోసం చేసి మీ కుమార్తెను వివాహమాడాలన్న దురుద్దేశంతో, మీరు మెచ్చుకో గలందులకు దైవభక్తి నటించాను. కాని ఈ నలభైరోజుల భక్తితో నే నెంతో మారాను. ఇక ఎప్పుడూ దొంగ తనాలు చెయ్యను. కష్టపడి జీవిస్తాను. నా జీవితమంతా అల్లా సన్నిధిలో గడి పేస్తాను. మీ కుమార్తెకు నేను తగినవాణ్ణి కాను. ఆమెను పెళ్ళాడాలన్న దురాశ ఇప్పుడు నాకు లేదు. మిమ్మల్ని మోసం చేసినందుకు నాకు మీరు ఏ శిక్షవిధించినా అనుభవించటానికి సిద్ధంగా ఉన్నాను,'' అన్నాడు.

రహీం ఈ మాటలు విని నిర్ఘాంత పోయి, తేరుకుని, ''పిచ్చివాడా! తెలియక అజ్ఞానంలో ఏదో చేశావు. పాపం చేస్తే భగవంతుడు క్షమించడన్న జ్ఞానం ఇప్పుడు నీకు కలిగింది. అల్లా నా కుమార్తె కొరకే నిన్ను పంపాడు. మీ కిద్దరికీ నేను వివాహం చేస్తాను,'' అన్నాడు.

రజియాకూ నసీర్‌కూ అతివైభవంగా వివాహం జరిగింది. నసీర్ నిజాయితీగా ఉంటూ, మామకు తగ్గ అల్లుడనిపించు కున్నాడు.





# వీర హనుమాన్

ఇంతలో విభీషణుడు అక్కడికి వచ్చాడు. అతన్ని చూసి ఇంద్రజిత్తు అనుకుని వానరులు చెల్లా చెదరై పరిగెత్త సాగారు. సుగ్రీవుడు ఆజ్ఞాపించగా జాంబవంతుడు వానరులతో, ''వచ్చినది విభీషణుడు, ఇంద్రజిత్తు కాడు,'' అని చెప్పాడు.

రామలక్ష్మణుల స్థితి చూసి విభీషణుడు చాలా బాధ పడ్డాడు. అతనికి తాను లంకకు రాజవుతానన్న ఆశ కాస్తా పోయింది.

సుగ్రీవుడు విభీషణుణ్ణి కౌగలించుకుని, ''విభీషణా, అప్పుడే రావణుడూ, ఇంద్రజిత్తూ నెగ్గారనుకోను. నువు లంకకు రాజు కాగలవు. రామలక్ష్మణులకు ప్రాణాపాయంలేదు. ఈ మూర్ఛ నుంచి తేరుకోగానే వాళ్ళు శత్రునాశనం చెయ్యగలరు,'' అన్నాడు.

తరవాత సుగ్రీవుడు తన మామ అయిన సుషేణుడితో, ''రామలక్ష్మణులు మూర్ఛ తేరగానే వీళ్ళనూ, కొందరు వానర వీరులనూ తీసుకుని కిష్కింధకు వెళ్ళిపో. నేను రావణుణ్ణి సకుటుంబంగా చంపి, సీతను తీసుకుని వస్తాను,'' అన్నాడు.

సుషేణుడు సుగ్రీవుడితో, ''పూర్వం దేవదానవ యుద్ధాలు జరగటం నాకు తెలుసు. అప్పుడు కూడా రాక్షసులు మాయా యుద్ధాలు చేసి దేవతలను చాలా మందిని పడగొట్టారు. కొందరు దేవతలు మూర్ఛపోయారు, కొందరు చచ్చి

**24. గరుత్మంతుడి సహాయం**



పోయారు. అప్పుడు దేవతల గురువైన బృహస్పతి మృతసంజీవనీ విద్యతోనూ, మూలికలతోనూ వారికి చికిత్స చేశాడు. సంజీవకరణీ, విశల్యకరణీ అనే ఓషధులు పాలసముద్రం వద్ద కొండలలో ఉంటాయి. పూర్వం క్షీరసాగరమధనం జరిగిన చోట చంద్రపర్వతమూ, ద్రోణ పర్వతమూ ఉన్నాయి. వాటి మీదనే ఈ ఓషధులు ఉంటాయి. అక్కడికి హనుమంతుణ్ణి పంపించు,'' అన్నాడు.

ఇంతలో ప్రళయంగా గాలి వీచింది. వానరులకు గరుత్మంతుడు వస్తూ కనిపించాడు. గరుత్మంతుడు రావటం చూసి, రామలక్ష్మణులను బాణాల రూపంలో బంధించి ఉండిన సర్పాలు భయపడి పారిపోయాయి.

గరుత్మంతుడు రామలక్ష్మణుల వద్ద దిగి, వారి ముఖాలూ, శరీరాలూ నిమిరాడు. వెంటనే వాళ్ళగాయాలు నయమయాయి.

రాముడు అతనితో, ''మీ దయవల్ల మేం తిరిగి ఎప్పటిలాగా బలవంతులమయాం. మిమ్మల్ని చూస్తుంటే మా తండ్రి దశరథమహారాజునూ, మా తాత అజమహారాజునూ చూసినంత ఆనందం కలుగుతున్నది. మీ దివ్యవస్త్రాలూ, ఆభరణాలూ చూడగా ఆశ్చర్యం కలుగుతున్నది. మీరెవరు?'' అన్నాడు.

గరుత్మంతుడు ఆనంద బాష్పాలు రాల్చుతూ, ''రామా, నేను నీకు స్నేహితుణ్ణి; ఇష్టుణ్ణి; నీ ప్రాణంలాటి వాణ్ణి; నా పేరు గరుత్మంతుడు. మీ ఇద్దరికీ సహాయం చెయ్యటానికే వచ్చాను. ఈ బాణపాశాలు నిజానికి సర్పాలు. వీటిని వదిలించటం అందరికీ సాధ్యం కాదు. అందుకే మీస్థితిగురించి వినగానే పరిగెత్తుకుంటూ వచ్చాను! మిమ్మల్ని విడిపించాను. ఈ యుద్ధంలో మీరు ఏ మాత్రమూ ఏమరుపాటుగా ఉండరాదు. రాక్షసులను నమ్మరాదని ఇప్పుడు మీకే తెలిసివచ్చింది గదా!'' అన్నాడు.

తరవాత గరుత్మంతుడు వెళ్ళిపోవటానికి రాముడి వద్ద సెలవు పుచ్చుకుంటూ, "నేను నీకు ఎలా స్నేహితుణ్ణని ఇప్పుడు అడగకు. ఈ యుద్ధంలో గెలిచిన అనంతరం ఆ సంగతి నీకే తెలుస్తుంది. యుద్ధం అయిపోయాక లంకలో పసివాళ్ళూ, ముసలివాళ్లూ మాత్రమే మిగులుతారు. రావణుడు చస్తాడు. సీత నీకు దక్కుతుంది," అని చెప్పి, ఆకాశమార్గాన ఎగిరి వెళ్ళిపోయాడు.

రామలక్ష్మణులు మామూలు మనుషులుకాగానే వానరులు తోకలు ఎగరేస్తూ సింహనాదాలు చేశారు. భేరీలూ, మృదంగాలూ మోగాయి. వానరులు చెట్లు పీకి, లంకాద్వారాలను ముట్టడించారు. అప్పటికి అర్థరాత్రి అయింది.

ఆ నిశిరాత్రివేళ వానరులు సింహనాదాలు చెయ్యటం రావణుడూ, రాక్షసులూ విన్నారు. రావణుడు తన మంత్రులతో, "వానరులు మహా ఆనందంలో ఉన్నట్టున్నారు. రామలక్ష్మణుల కోసం ఏడుస్తూ ఉండవలసిన వాళ్లు సంతోషంగా ఎందుకున్నారు?" అని వానరుల ఉత్సాహానికి కారణం తెలుసుకు రావటానికి రాక్షసులను పంపాడు.

వాళ్ళు వెళ్ళి ప్రాకారాల మీదికిఎక్కి, వానరసేననూ, బాణపాశాలు వదిలి



సుఖంగా ఉన్న రామలక్ష్మణులనూ చూసి రావణుడి వద్దకు తిరిగి వెళ్ళి, తాము చూసినది చెప్పారు.

రామలక్ష్మణులు ఇంద్రజిత్తు ప్రయోగించిన బాణబంధాల నుంచి బయటపడ్డారని విని రావణుడు వెలవెలపోయాడు. వాసుకి లాటి బాణాలు నిష్ఫ్రయోజనమయాయి. అతను ధూమ్రాక్షుడనే వాడితో, "నువు పెద్దసేనతో వెళ్ళి, వానరులనూ, రాముణ్ణీ చంపిరా!" అన్నాడు.

ధూమ్రాక్షుడు వెంటనే బయలుదేరి వెళ్ళి, సేనాధ్యక్షుడితో, తాను యుద్ధానికి పోతున్నాననీ, తన కోసం సేనను సిద్ధం



55



చెయ్యమనీ చెప్పాడు. ధూమ్రాక్షుడికి సేన సిద్ధమయింది. రకరకాల ఆయుధాలు ధరించిన రాక్షసులు ఆ సేనలో ఉన్నారు. వారిని వెంట బెట్టుకుని, ఉత్తమమైన రథం ఎక్కి ధూమ్రాక్షుడు పడమటి ద్వారం వద్దకు వెళ్ళాడు.

ధూమ్రాక్షుడు రావటం చూస్తూనే వానరులు సింహనాదాలు చేశారు. ఉభయ పక్షాలకూ పోరు ప్రారంభమయింది. రాక్షసుల ఆయుధాల చేత దెబ్బలు తింటూ వానరులు రాక్షసులను చెట్లతోనూ, గండ రాళ్ళతోనూ కొట్టారు. మొత్తం మీద రాక్షసులే ఎక్కువ నష్టపడి, పారిపోసాగారు. అది చూసి ధూమ్రాక్షుడు వానరులను హింసించ నారంభించాడు. వానరులు కూడా అధిక సంఖ్యలో చచ్చారు.

ధూమ్రాక్షుడు వానరసేనలను నష్టపరచటమే గాక, తరమటం చూసి హనుమంతుడికి చాలా కోపం వచ్చింది. అతను పెద్ద శిలను తీసుకుని ధూమ్రాక్షుడి మీదికి పోయి, అతని రథంమీద విసిరి కొట్టాడు. రథం ధ్వంసమయింది. రథం మీద పడే ఆ శిలను చూస్తూనే ధూమ్రాక్షుడు గద తీసుకుని, నేలమీదికి దూకి నిలబడ్డాడు.

తరవాత హనుమంతుడు చెట్ల బోదెలూ కొమ్మలూ తీసుకుని, రాక్షసులను ఎడా పెడా చదును చెయ్యసాగాడు. రాక్షసులు పారిపోయారు. తరవాత హనుమంతుడు ధూమ్రాక్షుడి పైకి వచ్చాడు.

ధూమ్రాక్షుడు గదతో హనుమంతుణ్ణి ఎదుర్కొని, దానితో హనుమంతుడి తల మీద కొట్టాడు. హనుమంతుడు ఆ దెబ్బను లక్ష్యపెట్టక, ధూమ్రాక్షుడి మీద ఒక పర్వత శిఖరాన్ని వేశాడు. ఆ దెబ్బకు ధూమ్రాక్షుడు చచ్చాడు. అది చూసి వానరులు మరింత ఉత్సాహంగా రాక్షసుల మీద పడ్డారు. రాక్షసులు భయపడి లంకలోకి పారిపోయారు.

ధూమ్రాక్షుడు చచ్చినట్టు విని రావణుడికి అమిత కోపం వచ్చింది. అతను వజ్రదంష్ట్రు డనే వాణ్ణి చూసి, ''నువు

వెంటనే వెళ్ళి, రాముణ్ణీ, సుగ్రీవుణ్ణీ, అందరు వానరులనూ చంపిరా!'' అన్నాడు.

వజ్రదంష్ట్రుడు మాయలు నేర్చినవాడు. అతను సైన్యాన్ని తీసుకుని, కవచం ధరించి, ధనుర్బాణాలు తీసుకుని, రథం మీద యుద్ధానికి బయలుదేరాడు. అతని వెంట మంచి మంచి అస్త్రాలు ధరించిన రాక్షసవీరులు బయలుదేరారు.

వజ్రదంష్ట్రుడి రాక్షససేనలు లంకా నగరపు దక్షిణద్వారం గుండా బయటికి వచ్చాయి. ఆ ద్వారాన్ని ముట్టడించినది అంగదుడు. వానరరాక్షసుల మధ్య భయంకరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో రాక్షసులు అనేకమంది వానరులను చంపటం చూసి అంగదుడు మండిపడి, దారుణంగా రాక్షసవధ సాగించాడు. అతని దెబ్బలకు అందుబాటులోకి వచ్చిన రాక్షసుల తలలు ఒక్కొక్క దెబ్బకే పగిలిపోయాయి.

అంగదుడి దెబ్బకు తట్టుకోలేక రాక్షస బలాలు చిందర వందర కావటం చూసి వజ్రదంష్ట్రుడికి కోపం వచ్చింది. అతను వానరసేన మీద బాణవర్షం కురిపించాడు. చివరకు అంగదుడూ, వజ్ర దంష్ట్రుడూ ఒకరి నొకరు ఎదుర్కొనటం జరిగింది. వారి మధ్య జరిగిన ద్వంద్వ



యుద్ధంలో అంగదుడు వజ్రదంష్ట్రుడి రథాన్ని ఒక శిలతో ధ్వంసం చేశాడు. వజ్రదంష్ట్రుడు గద తీసుకుని నేల పైకి దూకి, వెంటనే కొంతసేపు మూర్ఛ పోయాడు.

మూర్ఛ నుంచి బయటపడుతూనే వజ్ర దంష్ట్రుడు తన ఎదురుగా నిలిచి ఉన్న అంగదుడి రొమ్ము కేసి గద విసిరాడు. అటు తరువాత ఇద్దరూ ముష్టియుద్ధానికి దిగారు. ఇద్దరూ చాలాసేపు పోరాడి, అలసిపోయి మోకాళ్ళ మీద కూర్చుని ఉన్న సమయంలో అంగదుడు అకస్మాత్తుగాలేచి, వజ్రదంష్ట్రుడి తలను ఖడ్గంతో ఖండించాడు. వానరులు సంతోషించారు.



57



నిలవలేక పోవటం చూసి, హనుమంతుడు ముందుకు వచ్చాడు. అకంపనుడు హనుమంతుడి పైన బాణవర్షం కురిపించాడు. హనుమంతుడు ఆ బాణాలను లక్ష్యపెట్టక గట్టిగా సింహనాదం చేసి, భూమి అదిరేలాగ కాలుతాటిస్తూ, ఒక పెద్ద శిల తీసుకుని, అకంపనుడి మీదికి వెళ్ళాడు.

కాని అకంపనుడు తన బాణాలతో హనుమంతుడి చేతిలోని శిలను తుంపులు తుంపులు చేశాడు. హనుమంతుడు ఒక మద్దిచెట్టును పెకలించి, దానితో అకంపనుడి నెత్తి మీద కొట్టాడు. ఆ దెబ్బతో అకంపనుడు చచ్చిపడిపోయాడు.

రాక్షసులు ఇది చూసి భయపడి, తమ చేతుల్లోని ఆయుధాలు అక్కడే పారేసి, లంకలోకి పారిపోయారు.

అకంపనుణ్ణి చంపినందుకు హనుమంతుణ్ణి వానరవీరులు ఎంతగానో ప్రశంసించారు. హనుమంతుడు వాళ్ళను అభినందించాడు. వానరులు రాక్షసుల గుండెలు అదిరేటట్టు సింహనాదాలు చేశారు.

అకంపనుడు చచ్చాడని విని రావణుడు కొంచెంసేపు విచారించి, మంత్రులతో సంప్రతించి, తన సేనావ్యూహాలను పరీక్షించటానికి లంక అంతా తిరిగాడు. లంక అంతటా రాక్షసుల జెండాలు ఎగురు

వజ్రదంష్ట్రుడుచచ్చినట్టువిని రావణుడు అకంపనుణ్ణి సేనతో సహా యుద్ధానికి పంపాడు. ఆ ప్రకారమే అకంపనుడు మంచి రథం మీద, సేనను వెంటబెట్టుకుని బయలుదేరాడు.

మళ్ళీ రాక్షసులకూ, వానరులకూ తీవ్రమైన యుద్ధం జరిగింది. రెండు పక్షాలా అనేకమంది చచ్చారు. కుముదుడూ, నలుడూ, మైందుడూ, ద్వివిదుడూ అనే వానరవీరులు విజృంభించి రాక్షసులను చంపసాగారు.

అకంపనుడు ఆ వానర వీరులను గమనించి, తన రథాన్ని వారివైపు తోలించాడు. అకంపనుడి ముందు వానరులు

తున్నాయి. నగరం చుట్టూ వానరసేనలు ముట్టడివేసి ఉన్నాయి.

రావణుడు సభా భవనానికి తిరిగి వచ్చి, ప్రహస్తుణ్ణి చూసి, "శత్రుసైన్యాలు వచ్చి మన నగరాన్ని ముట్టడిస్తే, దాన్ని విడిపించటానికి ఇతరులు చేసే ప్రయత్నం నిరర్థకమని తోస్తుంది. ఆ పని చెయ్యగల వాళ్ళం నేనూ, కుంభకర్ణుడూ, నువ్వూ, ఇంద్రజిత్తూ, నికుంభుడూ మాత్రమే. నువ్వు తగిన సేనను వెంట తీసుకుపోయి, వానరసేనను జయించిరా." అన్నాడు.

అందుకు ప్రహస్తుడు ఇలా అన్నాడు:

"ఇది ముందు చర్చించిన సంగతే గద! దీన్ని గురించి మనకు మనస్పర్థ కూడా వచ్చింది. సీతను రాముడుకి ఇచ్చెయ్యటం క్షేమమని నాకు తెలిసినదే, లేకపోతే యుద్ధం తప్పదన్న సంగతి కూడా ముందే తెలుసు. అయితే నీకు ఇష్టమైన పని చేయటానికి నేను ఎప్పుడూ సిద్ధమే. నీ కోసం యుద్ధంలో ప్రాణాలు కూడా విడుస్తాను."

ఇలా అని, సేనానాయకుడైన ప్రహస్తుడు పెద్ద సేనను బయలుదేర తీయమని సేనాధ్యక్షులకు ఉత్తరువు ఇచ్చాడు. రాక్షస వీరులు విజయం కోరి హోమాలు చేసి, బ్రాహ్మణులను అర్చించి, యుద్ధానికి కదిలారు. ప్రహస్తుడు భేరీమోగించి, గుర్రాలు పూన్చిన రథం మీద బయలుదేరాడు. అతని వెంట అతని నలుగురు మంత్రులూ, నరాంతకుడూ, కుంభహనుడూ, మహానాదుడూ, సమున్నతుడూ అనేవాళ్ళు బయలుదేరారు.

రాముడు ప్రహస్తుడు రావటం చూసి విభీషణుడితో, "ఆ వచ్చేరాక్షసుడు చాలా పరాక్రమవంతుడు లాగా కనబడతాడు. ఎవరతను?" అన్నాడు.

"అతను రావణుడి సేనానాయకుడు; ప్రహస్తుడు. రావణుడి సేనలో మూడో వంతు ఇతని కింద ఉంటుంది. ఇతను అస్త్రాలు తెలిసినవాడు. పరాక్రమవంతుడుగా ప్రసిద్ధి కలవాడు." అని విభీషణుడు రాముడికి చెప్పాడు.





వరం పర్వతదుర్గేషు భ్రాన్తం వనచరైః సహ,
న మూర్ఖజనసంపర్కః సురేన్ద్ర భవనేష్వ పి. 1

[మూర్ఖజనుల మధ్య సంపదలలో ఓలలాడేకన్న, పర్వతారణ్య ప్రాంతాల, వన్యమృగాలతో కలిసి జీవించటం మేలు.]

హరేః పదాహతిః శ్లాఘ్యా న శ్లాఘ్యం ఖరరోహణమ్,
స్పర్ధాపి విదుషా యుక్తా న యుక్తా మూర్ఖమిత్రతా. 2

[గాడిద మీద ఊరేగేదానికన్న, మహావిష్ణువు చేత తన్నులు తినటం ఏ విధంగా ఉత్తమమో; అదే విధంగా మూర్ఖులతో స్నేహం కన్న, పండితులలో విరోధం మేలు.]

అన్యస్మాల్లబ్ధపదః ప్రాయో నీచోపి దుఃసహో భవతి,
రవిరపి న దహతి తాదృగ్ యాదృగ్ అయం దహతి వాలుకానికరః. 3

[స్వశక్తి వల్ల కాక, పరుల సహాయంతో ఉన్నత పదవికి వచ్చిన నీచుణ్ణి సహించటం కష్టం. సూర్యుని వేడికన్న, సూర్యకిరణాల వల్ల వేడిఎక్కిన ఇసుకను భరించటం కష్టంగదా!]

Photo by Anant Desai



బహుమతి
పొందిన వ్యాఖ్య

వ్యర్థం కాని పని

పంపినవారు :
ఎస్. బడేమియా

Photo by Devidas Kasbekar



బస్‌స్టాన్డ్ రోడ్,
ఖమ్మం.

అర్థం లేని పని

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







* వ్యాఖ్యలు సెప్టెంబర్ 20 వ తేదీ లోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డు పైన మాత్రమే రాయాలి. అడ్రసు: ఫోటో వ్యాఖ్యల పోటీ, చందమామ. మద్రాసు–26
* వ్యాఖ్యలు ఒక్క మాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు నవంబర్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | | | |
|---|---|---|---|---|---|
| మిత్రసంప్రాప్తి – 39 | ... | 2 | పనికిమాలిన ప్రోత్సాహం | ... | 31 |
| మాయాసరోవరం–9 | ... | 5 | వైరిబాగులవాళ్ళు | ... | 35 |
| దైవద్వేషం | ... | 13 | వింత తాకట్టు | ... | 37 |
| మంచిమనసు | ... | 17 | భక్తుడైన దొంగ | ... | 42 |
| రాకుమారి లవంగలత | ... | 22 | వీరహనుమాన్ - 24 | ... | 45 |
| ప్రాప్తం | ... | 28 | అమరవాణి | ... | 53 |



Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

# ఆశ్చర్యం కలిగించే క్రొత్తరుచి!

# ఫ్రూట్రీన్

10 ఫలరస
భరితమైన కమ్మని
మిఠాయిలుగల
ప్యాకెట్ ధర
రు.1-50 మాత్రమే!

fruitrine

కమ్మని ఫలరసం, తియ్యని మీగడపాలు నిండుగా గుప్పించబడిన 10 అత్యద్భుతమైన మిఠాయిలు. మూడు రకాల ఫలరస పరిమళంతో!

నిండైన ఫలరసం, మెండైన వినోదం!
నూతన ఫ్రూట్రీన్ నిత్యానందం!



nutrine ఒక్కొక్క మిఠాయి యందు - ఫలరస పూరిత విందు!

NFCM-1-76 TEL

# అమృతాంజన్

## తలనొప్పులకు జలుబులకు బెణుకులకు
## ఇంటింటా ఉండవలసిన దివ్యౌషధము







నొప్పులకు, జలుబులకు, బెణుకులకు ఉపశమనం కలిగించే అమృతాంజన్‌ను బాధగా ఉన్నచోట కొద్దిగా రాసి రుద్దండి. దానిలో చేరి ఉన్న పది శ్రేష్ఠమైన ఔషధాలు నిమిషాలమీద గుణంకలిగిస్తుందని మీరు తెలుసుకొంటారు. ఆదాచేసే పెద్ద సీసాలలోను, చిన్న సీసాలలోను తక్కువ వెలకు ఇమిడికగా చిన్న డబ్బాలలోను లభిస్తుంది.

అమృతాంజన్-80 సంవత్సరాలకు పైబడిన నమ్మకమైన దివ్యౌషధము.




అమృతాంజన్ లిమిటెడ్

AM-1255



హరి ప్రసాద్ కంబైన్స్

# పొరుగింటి పుల్లకూర

స్క్రీన్ ప్లే, దర్శకత్వం: వి. మధుసూదన రావు  నిర్మాత: అట్లూరి హనుమంతరావు

మాటలు: బొల్లిముంత శివరామకృష్ణ  సంగీతం: చక్రవర్తి  కెమెరా: పి. భాస్కర రావు  అన్నపూర్ణా ఫిలింస్

A.S. Murty

ANNAPURNA

